# అన్నది... అనుకొన్నది...

(ప్రసంగాలు, సమీక్షలు)



అవధానుల మణిబాబు

# అన్నవి... అనుకొన్నవి...

(ప్రసంగాలు, సమీక్షలు)

అవధానుల మణిబాబు

**ANNAVI... ANUKONNAVI...**

(Speeches & Reviews)


By

**Avadhanula Mani Babu, M.Sc., B.Ed.,**



First Edition :
September, 2015





DTP & Printing at
**Tirumala Publications**
Kakinada. Cell : 9948598966

**Price : Rs. 100/-**

For Copies :

**A. Sita Rama Lakshmi**
D.No. 3-62, Near Bank of Maharastra,
Sarpavaram, Kakinada Rural, E.G. Dist.
Andhra Pradesh - 533 005.




డా. అద్దేపల్లి రామమోహనరావు గారు

డా. రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు గారు

డా. టి. విశ్వనాథరావు గారు

*****

డా. ఆవంత్స సోమసుందర్ గారు

డా. గజరావు సీతారామ స్వామి గారు

శ్రీ దంటు సూర్యారావు గారు

డా. వుయ్యపు హనుమంతరావు గారు

శ్రీ గొట్టుముక్కల వేంకట సత్య నరసింహశాస్త్రి గారు

శ్రీ మాకినీడి సూర్యభాస్కర్ గారు

శ్రీ కొరుప్రోలు గౌరినాయుడు గారు

శ్రీ కాకరపర్తి దుర్గా ప్రసాద్ గారు

డా. ఆలూరి విజయలక్ష్మి గారు

డా. వాడ్రేవు వీరలక్ష్మీ దేవి గారు

పసుమర్తి పద్మజవాణి గారు

... వీరందరికీ

*****

ఋషిపీఠం, ఆంధ్రప్రభ - సాహితీ గవాక్షం, సాహితీ ప్రస్థానం, మల్లె పందిరి, ప్రజాప్రభాతం, సీనియర్ సిటిజన్ వాణి, కళాగౌతమి, చినుకు.... పత్రికలకు;

ప్రతినెలా సాహిత్య హేల, ఆంధ్ర సాహిత్య పరిషత్, ఆస్వాదన సాహితీసమితి, శ్రీ వాణీ రసరాగ సభ, కాకినాడ; సాహితీ మిత్రులు, మచిలీపట్నం; రమ్య భారతి, విజయవాడ; ఆంధ్రీ కుటీరం, పల్లెపాలెం... వేదికలకు

మరెందరికో...

**శిరసా నమామి.**



**Dr. Rentala Sri Venkateswara Rao**
Principal, Govt. Degree College
Kothapeta, E.G.Dist., A.P.
Mobile : 7799111456

# 'అనిపించినవి'

మణిబాబుగారూ !

ముందుమాట రాయడం అంటే పుస్తకానికి తొలి పాఠకుడు కావడం. ఆ గౌరవాన్ని నాకు కల్పించినందుకు ధన్యవాదాలు.

మీరు **'అన్నవి, అనుకున్నవి'** (పేరు బలే బావుంది) చదివినప్పుడు నాకు అనిపించినవి ఇక్కడ రాస్తున్నాను.

మీ ప్రవర్తనలో, మాటతీరులో ఒక పొందిక, కుదురు కనిపిస్తాయి. అవే మీ రాతలో కూడా కనిపించి (అలా కనిపించడం అతి సహజం అయినా) నాకు ముచ్చటేసింది.

ఏ సాహిత్య సభకు వెళ్ళినా తలపండిన వాళ్ళే తప్ప యువకులెవరూ కనిపించడంలేదని నాలాంటి వాళ్ళం పెట్టుకున్న బెంగ మిమ్మల్ని, మీ రచనను చూశాక తప్పకుండా కొంతమేరకు తగ్గుతుంది.

ఉపన్యాసం ఒక సాహిత్య ప్రక్రియ అని నా భావన. ఒక మంచి ప్రసంగం ఒక మంచి వ్యాసం కూడా అవుతుంది తనదైన ప్రత్యేకతలతో. మీరు మీ ఉపన్యాసాలను వ్యాసరూపాంతరీకరణతోనే అయినా భద్రపరచడం బాగుంది. అద్దేపల్లి రామమోహన రావు గారి వంటి వాళ్ళు నన్ను మందలిస్తూ ఉండేవాళ్ళు – "మీరు మంచి విషయాలు చెబుతున్నారు, మీ ఉపన్యాసాలలో. కానీ, వాటిని వ్యాసాలుగా రాయడం లేదు" అని. మీరు నాకన్న బుద్ధిమంతులుగా కనిపిస్తున్నారు – ఈ విషయంలో. మీకు నా అభినందనలు.

ఇన్నిసభలలో ప్రసంగించారంటే మీరు మంచి వక్త అయి ఉండాలి. మంచి వక్తలు మనకు చాలా అరుదుగా దొరుకుతారు. మాట్లాడిన ప్రతి వ్యక్తీ వక్త కాదు. వేరే పేరుతో వ్యవహరించాల్సిన వాళ్ళు చాలా మంది కనిపిస్తున్నారు. కొందరి మాటలయితే కేవలం చప్పుళ్ళే. అవి భాషా విభాగానికి చెందవు.

ఉపన్యాసానికి ఎవరైనా పిలవడం అంటే మనకి ఒక అవకాశం ఇచ్చినట్టు, శ్రద్ధగా చదువుకోవడానికి, తద్వారా నేర్చుకోవడానికి... అలాగే భావాలను ఏరుకోవడానికి, వాటిని మాటలలో పొందిగ్గా పట్టుకోవడానికి. ఇది అందరి విషయంలోనూ నిజమని నేననుకోనుగానీ మీరు మాత్రం మంచి లబ్ధిని పొందుతున్నట్టు చెబుతున్నాయి ఈ వ్యాసాలు.

ఈ పుస్తకంలో నన్ను ఆకట్టుకున్న ఒకటో విషయం వైవిధ్యం. రకరకాల పుస్తకాలను మీరు చదువుతున్నారు. 'మేఘసందేశం' గురించి, 'బండారు తమ్మయ్య'గారి గురించి, ఆధునిక కవిత్వం గురించి, నవల గురించి కూడా మాట్లాడగలగడం బావుంది. దేనిగురించి మాట్లాడమని సూచిస్తే వాటిపై మాట్లాడడం వల్ల కలగూర గంపగా తయారైంది అన్నారు. తయారైంది కాని మీరు అనుకున్నట్టు అది లోపమేమీ కాదు. ఎక్కువ శాతం విమర్శ వ్యాస పుస్తకాలు ఇలానే ఉంటున్నాయి. వైవిధ్యం ఒక అందం.

'సోమసుందర్'గారితో జరిపిన సంభాషణను కేవలం మామూలు ఇంటర్వ్యూగా ఉంచెయ్యకుండా ఆ సంభాషణల సందర్భంలో ప్రసక్తాలయ్యే ఆయన అభిప్రాయాలను ఇతర రచనల నుంచి కూడా తీసి శ్రద్ధగా గుది గుచ్చడం ప్రత్యేకంగా ఉంది. 'పంజరం కోరిన మనిషి' నవలా సమీక్షలో కథ నుంచి పిండిన సారం, సంఘటనలకు చేసిన వ్యాఖ్యానాలు, మీ వ్యక్తిత్వాన్ని కూడా ఆవిష్కరిస్తున్నాయి.

మీ ఆలోచనలు, భావాలు ఆరోగ్యంగా ఉన్నాయి.

'వాన కురిసిన రాత్రి' గురించి ప్రసంగిస్తూ అది ఎంత మంచి కవితా సంపుటో చెబుతూనే ఒక కవిత ముగింపులోని పేలవతను కూడా ప్రస్తావించగలగడం మీరు వక్తగా సంపాదించుకున్న స్వేచ్ఛను తెలియచేస్తూ నన్ను సంతోషపెట్టింది.

మనుషులందరినీ సమంగా ప్రేమించగలగడం ఒక సిద్ధి అంటారు. తటస్థపడ్డ పుస్తకాలన్నిటినీ అలాగే ఇష్టపడడం కూడా ఒక సిద్ధే. అది ఏ పుస్తకం కానివ్వండి. మీరు శ్రద్ధగా చదువుతున్నారు. ఇష్టంగా పరిచయం చేస్తున్నారు. మీ వ్యాసాలలో విశ్లేషణ, వ్యాఖ్యానం కూడా ఉన్నాయిగాని అవి ప్రధానంగా పరిచయాత్మకాలు. చేసిన మటుకు వ్యాఖ్యానం, విశ్లేషణ బావున్నాయి. మీకు పరిచయ కళ బాగా తెలిసింది. పుస్తకంలో ప్రధానమైన విషయాలన్నిటినీ సారం ఎక్కడుందో



పట్టుకుని, సరళంగా, ఏ రకమైన సందిగ్ధతలు లేకుండా, చెప్పుకుంటూ పోయే శక్తి అందరికీ అబ్బదు.

పరిచయాత్మక వ్యాసాలకు ఉండే విలువ ఎంత మంది గుర్తించారో తెలియదు కాని ఒక సాహిత్య పాఠకుడిగా నా ప్రయాణం మొదలయిన రోజుల్లో పత్రికల్లో వచ్చిన పరిచయాత్మక వ్యాసాలు చదవడం ద్వారానే ఆయా పుస్తకాల ఉనికి నాకు తెలిసింది. ఆ వ్యాసాల ద్వారానే నా అభిరుచికి అనువైన వాటిని గుర్తుపెట్టుకుని, ఆ తర్వాత వాటిలో కొన్నింటిని నేను వెతుక్కుని చదువుకున్నాను.

మీ పఠన వైవిధ్యం బావుంది. మీరు విశాలంగా చదువుతున్నట్టున్నారు. కేవలం చదవడం మాత్రమే కాక విలువైనవీ, అందమైనవీ ఎన్నో వాక్యాలను, పద్యాలను గుర్తుపెట్టుకుంటున్నారని గమనించాను. మీ రచనలో అవి జీడిపప్పుల్లా తగిలి రుచిని పెంచుతున్నాయి. వాల్మీకినీ, రూమీనీ, ఫ్రాయిడ్‌నీ, డేల్‌కార్నిగీనీ, టాగూర్‌నీ, ముకుందమాలాకారుణ్ణీ... ఆయా సందర్భాలలో మీరు ఉటంకిస్తూ వచ్చిన పద్ధతి బావుంది. ఆరోన్ షెపార్డ్ కథా విమర్శ, గాబ్రియల్ ఒకారా కవిత నాకు తెలియవు.

ఈ పుస్తకం మీ సాహిత్య రచనా ప్రయాణంలో ఓ మజిలీ. మీరు ఎటు వెళుతున్నదీ, ఇప్పుడెక్కడున్నదీ కూడా ఇది తెలియచేస్తుంది – అందరికీ, ముఖ్యంగా మీకు.

మీ తొలి అడుగులు సరిగ్గా ఉన్నాయి. మీ ప్రయాణం చాలా విలువైనదిగా ఉండగలదన్న భరోసానిస్తున్నాయి. శుభం.

**– డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు**

**Dr. T. Viswanadha Rao**
(Rtd.,) Professor of English
302, Kamalakshi Residency
Sarpavaram Jn., Kakinada - 05.
Mobile : 9989102509

# అభినందన

మిత్రులు మణిబాబు అన్నవి... అనుకొన్నవి... గ్రంథాన్ని ఆద్యంతం ఆసక్తిగా చదివాను. పఠితలలో ఉత్సుకత రేకెత్తించగల శైలి, ఇతరులలో గుణాలను ఉదాత్తంగా దర్శించగల సహృదయత వారిలో మెండుగా వున్నవి. 'పరగుణపరమాణుః పర్వతీకృత్య నిత్యం' అనే ఆర్యోక్తికి వారి విశ్లేషణా పద్ధతి నికషోపలమని నాకనిపిస్తున్నది. లబ్ధ ప్రతిష్ఠులలోనే గాక కొంగ్రొత్త రచయితలలో కూడా మంచిని దర్శించగల రసజ్ఞత వారిది. కానీ యెంతటి సద్విమర్శకునికైనా గ్రంథగతమైన పరిమితులను గుర్తించి నిష్కర్షగా వాటిని పాఠకుల ముందు వుంచవలసిన ఒక గురుతుర బాధ్యత వున్నది. సదుద్దేశంతో అంతగా పరిణతి చెందని రచయితలను భవిష్యత్తులో అటువంటి పరిమితులకు దూరం చేయడం మాత్రమే దీని లక్ష్యం. ఇది యెవ్వరినీ కించపరచేది కాదు.

మణిబాబు, వారి విమర్శనా వ్యాసాలను ప్రారంభించే విధానం శ్లాఘించ దగినది. ఉపన్యాసకునికి యెత్తుగడ యెంతో ముఖ్యమైనది. సభాసదులను ముందు పలుకులతో ఆకట్టుకోలేనివారు ఉపన్యాసకులుగా రాణించటం చాలా కష్టం. ముందు చెప్పిన మాటలు విన్న సభాసదులకు తరువాత ఏమైనా మాటలు వినకపోతే ఉపన్యాసంలో ముఖ్యాంశాల క్రమణిక తప్పుతామేమో అనే సందేహం కలగాలి. ఈ విషయం గ్రహించిన మణిబాబు చక్కని ప్రాతిపదికలు ఆరంభంలోనే పాఠకుల ముందుంచటం వలన వారి ఆసక్తి పెరుగుతుంది.

విమర్శకులలో, సమీక్షకులలో యెవరి శైలి వారిది. మణిబాబు చిన్నతనంలోనే తనదైన ఒక శైలిని స్వంతం చేసుకున్నారు. రచయితల నుడులు, సంప్రదాయానుగతమైన నానుడులు పుణికిపుచ్చుకొని వాటిని అవసరమైనచోట అద్ది, సర్ది వ్రాయటం ఒక విమర్శకుడుగా వారి విజయానికి కారణం.



కాళిదాసు 'మేఘసందేశం' నుండి ఇంద్రగంటి జానకీబాల 'పంజరం కోరిన మనిషి' వరకు, మునిమాణిక్యం నరసింహరావుగారు గృహ జీవనంపై చేసిన సున్నితమైన విశ్లేషణలు, ప్రయోగాలు – యేదీ వదలకుండా స్థాలీపులాక న్యాయంగా అవసరమైన వాటిని స్పృశిస్తూ, రచయితల మనోభావాలని మన ముందు ఆవిష్కరించడానికి వారు చేసిన ప్రయత్నాన్ని మెచ్చుకుంటూ, వయస్సులో అతని కంటే పెద్దవాడిని అయినందువలన భవిష్యత్తులో వారింకా చక్కని విశ్లేషణలు చేసి విమర్శకుడుగా యింకా యెత్తుకు యెదగాలని ఆకాంక్షిస్తూ, ఆశీర్వదిస్తూ సెలవు తీసుకుంటున్నా.

భవదీయుడు

**డా॥ టి. విశ్వనాథరావు**

# నావో రెండు మాటలు...

ఆధునిక విజ్ఞాన శాస్త్రంవలెనే సాహిత్య విమర్శను కూడా Pure Criticism, Applied Criticism అనే రెండు భాగాలుగా విభజింపవచ్చుని; సాహిత్యంలోని స్థితిని, గతిని, రీతిని, విలువలను, జయాపజయాలను వింగడిస్తూ నిరంజనంగా సాగేది మొదటిదైతే, ఒక కవికృత కావ్యాన్నో, సాహిత్య గ్రంథాన్నో తన ప్రధాన ప్రమేయంగా కేంద్రీకరణ సాగించేది రెండవదని "కవిత్వం కాలాతీత కాంతిరేఖ" అనే గ్రంథంలో డా. ఆవంత్స సోమసుందర్ ప్రతిపాదిస్తారు.

పై ప్రస్తావన ఉద్దేశ్యమేమంటే నా ఈ వ్యాసాలన్నీ రెండవ వర్గీకరణకు చెందినవి.

ఇవన్నీ, చేసిన ప్రసంగాలు... సమీక్షించిన పుస్తకాలపై ఏర్పరచుకున్న అభిప్రాయాలునూ...

అందుకే కొన్ని **అన్నవి...** మరికొన్ని **అనుకొన్నవి...**

ఆయా గ్రంథాలలోని అంతస్సారాన్ని, కవి తాలూకు ఆత్మను నా జ్ఞానపరిధికి అందినంతమేరకు అక్షరీకరించే ప్రయత్నం చేశాను.

ఆశీర్వదిస్తారని ఆశిస్తూ...

**– అవధానుల మణిబాబు**



# ఈ క్రమంలో...

# 1 ఆత్మ, పరమాత్మల సంలీనానికి ఆలంబనగా నిలిచే 'ఉపాయనం'

**"నీ మాటలు నాకు సులభంగా తెలుస్తాయి ప్రభూ! కానీ నువ్వు తమకు తెలుసునని మాట్లాడేవాళ్ళ భాష అర్థం కాదు" – రవీంద్రనాథ్ టాగూర్.** ఈ పదాలు చదివిన ప్రతిసారీ భగవత్తత్వాన్ని సరళతరం చేసే ప్రయత్నంలో మనం మరింత సంక్లిష్టం చేసుకుంటున్నామనిపిస్తుంది. అయితే, వేలాది మెట్లపైనున్న అందుకోలేని శక్తిగాకాక, మనతో మమేకమైన ఓ సామాన్య వ్యక్తిగానే దైవాన్ని భావిస్తూ; పరమాత్మతో గల అజరామర సంబంధాన్ని; తనకు కావలసినది, ఆయన ఇవ్వగలిగినది, ఇరువురికీ నడుమ అడ్డంకిగా నిలుస్తున్న అశక్తత, అల్పజ్ఞత, అపరిపక్వత, అనిశ్చితి... వీటన్నిటినీ ఆర్తిగా ఆవిష్కరిస్తూ; మనం ప్రభువుకి ఎంతో చేరువలోనే ఉన్నామనే భావన కలిగిస్తూ, ఆధ్యాత్మిక సాహితీ ప్రియులకు స్వర్గీయ ఓలేటి వేంకట రామశాస్త్రిగారందజేసిన దివ్య గ్రంథం – **'ఉపాయనము'.**

**"విశ్వంబునం దెల్ల విహరించెదవు గాని**
**కానగా రావు నా కన్నుగవకు**
**తలపుచే సర్వంబు సలుప నేర్తువుగాని**
**కలుగ జేయవు నాకు గాఢభక్తి**
**నిఖిలంబు నీలోన నిల్పుకొందువుగాని**
**చేరజోటీవు నా చిత్తమునకు**
**జ్ఞాన మెల్లర కీవ కలిగించెదవు గాని**
**తెలుపవు నీ రూపు తెరగు నాకు"**

– ఇలా, ఒక పాదంలో స్వామి భక్తిని, తరువాత పాదంలో తన జ్ఞానేంద్రియాలకు అందవలసినదేదో పొందలేకపోతున్నాననే ఆవేదననూ వ్యక్తపరుస్తూ; చివరకు – "ఓ! నిష్పక్షపాత! సర్వసమభావ! నీకు నాపై పంతమూ లేదు, వైరమూ



లేదు; **అన్నిటికి గారణములు నాయందు కలవు** అని అంగీకరిస్తూ; 'నిష్పక్షపాత! సర్వ సమభావ' సంబోధనల ద్వారా స్వామి లోపరాహిత్యాన్ని తెలియజేస్తారు.

అయితే, మనం పొందవలసినవాటిని పొందడానికి అవరోధంగా గల అంశాలలో ప్రధానమైనది – ఏకాగ్రతాలోపం. **"నిను జూడవలెనంచు గనులు మూయుదు గాని / యెద్దియో వచ్చి నా యెదుట నిల్చు"** నిశ్చలముగా బుద్ధి నిలిపి నిన్ను ఏనాడు ఎదను సంస్మరించాను? నిష్కామ వృత్తితో నమ్మి, ఎప్పుడు సేవ చేసాను? కనులతో వేరేదీ చూడకుండా నిన్ను మాత్రమే ఎప్పుడు చూసాను? **నీవు నన్నేల వనుచు మొత్తుకొను టొక్కటే తప్ప** వీటిలో ఏవీ ఆచరించలేకపోయానని పశ్చాత్తాపాన్ని వ్యక్తం చేస్తారు.

పోనీ, నిన్ను ఆహ్వానిస్తూ పిలవడంలోనైనా పరిపూర్ణత ఉన్నదా! యుగ యుగాలుగా ఎందరో పిలవగానే పరుగులెత్తి వెళ్ళి కాచినవాడివి; వారిలా "కన్నీరు మున్నీరుగా ఏడ్చితే, గొంతెత్తి పిలిస్తే, అవశత్వమున నిన్ను అర్థిస్తే, కరిగిపోయి, కరుణించి వచ్చి కోర్కెలు తీర్చకుండా ఉండగలవా?" కానీ **"ఏది! నా కట్టినేర్పు? నిన్నెటు గురించి యెట్లు ప్రార్థించి దరిజేరనెట్లు పిలిచి యెట్టు లడుగంగ వలయునో యెరుగనైతి"** అంటారు, కవి.

కావలసినది అడగడమైనా తెలియని అప్రయోజకుడనైనా నీ వాడినేగా స్వామీ! బహుశా నన్ను గుర్తు పట్టడం లేదేమో! నేను వేరేవడినో కాదు – **"చిత్రమై వెలయు నీ సృష్టి నుద్భవమైనవాడిని; భద్రమై యొప్పు నీ పరిపాలనములోని వాడిని; దివ్యమై తనరు నీ దృష్టిలోపలనున్న వాడిని; పుష్టమై యున్న నీ పోష్య వర్గములోని వాడిని"** ఇలా... ప్రతి పూజకూ ముందు సంకల్పంలో గోత్రనామాదులు చెప్పుకున్నట్లు జగత్పితకు తనను తాను పరిచయం చేసుకుంటాడు కవి. అంతటితో ఆగకుండా స్వామితో తనకు గల అవినాభావ సంబంధాన్ని తెలుపుతూ అంటారు :–

**హృదయపాత్రంబులో నేమి యున్నదొ కాని**
**తొలకుచున్నది నిన్ను దలచినపుడు!**
**ఈ మనః ఫలకమం దేమి యున్నదొ కాని**
**మ్రోగుచున్నవి నిన్ను మ్రొక్కినపుడు!**

అంటే కేవలం నీకు మాత్రమే చెందిన అంశమేదో ఈ హృదయంలోనూ, ఈ మనస్సులోనూ ఉంది. అందుకే నీ ప్రసక్తి వచ్చిన ప్రతిసారీ ఈ హృదయం, మనస్సు దివ్యానుభూతికిలోనై ఎగసి పడుతున్నాయి – అంటూ స్వామికి తన హృదయ మానసాదులు అర్పణ కాబడ్డ విషయాన్ని తెలియజేస్తారు.

***

అయితే, ఇంతగా దగ్గర వాడినని చెప్పుకున్నా స్వామి కృప లభించక, "నాపై కరుణ చూపడం సర్వకర్త చేయజాలని కార్యమేమో? నన్ను కట్టుకోవడం **విశ్వభర్తయు మోయవ్రేగైన భారంబుగాబోలునే"** అని నిందాస్తుతి ఆరంభిస్తారు. ఇక్కడ విశ్వ "భర్త", కట్టుకోవడం పదాలు చాలా అర్థవంతంగా ప్రయోగించినట్లుంటుంది.

మరోచోట, తనను మరిచిపోవడానికి కారణాలుగా స్వామి వినోదాలను గుర్తు చేస్తారు. **"మేఘ మండలముపై మెరుపు దీవలతోడ ముద్దులాడుచు; మవ్వంపు పసులలో బువ్వ దీవియలతొ నవ్వులాడుచు; పర్వతాగ్రములపై నుర్వీరుహాళితో నాటలాడుచు; పొంగారు నదుల దరంగ మాలికలతో జల్లులాడుచు**"; వీటన్నిటి మధ్య నువ్వు నా ప్రసక్తి మరచిపోయినా నేను ఊరుకుంటానా? **'దిన దినము మ్రొక్కి జ్ఞప్తికి దేకయుండ?'** అంటారు – ఈ వాక్యం నిత్య ప్రార్థనావశ్యకతను స్పష్టం చేసినట్లవుతుంది.

ఎప్పుడూ కష్టాలెరుగని స్వామికి భక్తుల కష్ట సుఖాలు తెలియవంటాడు కవి. **"అనుభవమ్మున లేకుండ నన్య బాధ / దేవుడవెయైన నీకేల దెలియవలయు?"** అందుకే? నిత్య సంపత్సమన్వితుడవైన నీకు నా 'లేవడి పాటులు"; సతత పూర్ణానంద యుతుడవైన నీకు నా దుఃఖం తెలిసే అవకాశం లేదు. అందుకే చెబుతున్నపుడైనా నీ చెవిని బెట్టి **"ఆలకించి కృతార్థుఁ జేయఁ దగదయ్య?"** అని సభక్తికంగా నిర్దేశిస్తారు.

***

మరోచోట భగవంతునికి అంతులేని చనువుతో హెచ్చరిక చేస్తూ :

**మానావ మానంబు లేనొక్క తెరగుగా**
**నెంచు నా దేల నీ హితము నాకు?**



**కష్టంబు సుఖము నొక్క విధంబుగా సమ్మ**
**తించు నాదేల నీ దిక్కు నాకు?**
**కాంచనంబును మంటి గడ్డయు నొకటిగా**
**గాంచు నాదేల నీ కలిమి నాకు?**
**తానంచు బరుడంచు దలపోయు బుద్ధి న**
**శించునాదేల నీ చేత నాకు?**
**అట్టి సమబుద్ధి నాకు లభ్యమగు వరకె?**
**యేను గోరుట యీవు నా కిచ్చుట యును**
**ఆవుల "నీకిత్తు బుచ్చుకొ"మ్మన్న "నాకువలదు! పో"మ్మందు;**
**నిది నీవు తలచికొనుము.**

ఇంత ఘాటుగా, నిర్మొగమాటంగా పొమ్మంటున్నా, తాను ఆశించేది "దుఃఖేష్వనుద్విగ్నమనాః/ సుఖేషువిగత స్పృహః / వీత రాగ భయ క్రోధః / స్థితధీ ర్మని రుచ్యతే" అని సాక్షాత్ భగవానుడు ప్రస్తావించిన ఆ **'సమ బుద్ధి' ప్రసాదించమనే!** అని స్పష్టం చేస్తారు.

కాసేపటికి, ఈ అలకస్థాయి పెరిగి **"ఆద్యంత రహితుడవైన నిన్ను ఆశ్రయించుట; అస్పష్ట చరితుడవైన నిన్ను అభినుతించుట; ఆకార శూన్యుడవైన నిన్ను అరయగోరుట; అవ్యక్త హృదయుడవైన నిన్ను అర్థించుట – ఇవన్నీ నా తప్పులే అంటావేమో!"** అని నిష్ఠూరమాడుతూనే స్వామి అనంతత్వాన్ని, నిరాకార తత్వాన్ని, రూప, గుణ విశేషాలను అందుకోలేని తన పరిమిత శక్తిని వ్యక్తం చేస్తారు.

***

నీకేదో దోషమాపాదించి దూషిస్తాను – అది నిజమనుకోకు; పలుమార్లు ఒకటే పాటను పాడతాను – వినజాలనని నీవు విసుగుపొందకు; నాకిష్టమైన కోర్కెలన్నిటినీ అడుగుతాను – అత్యాశ కలవాడననుకోకు. మనోవృత్తులను అరికట్టడం నా బోటి వాడి తరమవుతుందా? **"ఎప్పుడో నీ కటాక్ష మొక్కింత సోక నన్నియు నడంగి తృప్తుండ నగుదు నేను"** అని తనలో ఈ లౌల్యాలను తొలగించే బాధ్యత కూడా స్వామికే అప్పగిస్తారు.

ఇక, నవ విధ భక్తిమార్గాలలో చివరిదైన ఆత్మనివేదన స్థితికి చేరుకుని **"ఇదిగో! నా మనసు నీకిస్తున్నాను. దీనిని తిన్నబరచి నీవే దిద్దుకో. నా అంగము లన్నిటినీ నీ ఆధీనములో ఉంచుతున్నాను. నీవు చెప్పినట్లు చేయించుకో. నా ఆత్మ నీదే – దీనిని నీయందు నిలబెట్టుకో. అవీ, ఇవీ అవనేల? నావెల్ల నీవే తీసుకుని యుక్తమార్గమున ఉంచుకో."** అని తనువు, మనసునే కాక తనవన్నిటినీ అర్పణ చేస్తూ **"దాతవై, త్రాతవై; హితుడవై, రతుడవై; కర్తవై, భర్తవై; పరుడవై, గురుడవై – అన్నిటికీ నిన్నే నమ్మి, నీ మాట విశ్వసించి నా భారమంతా నీకే విడిచిపెట్టాను, శాశ్వతముగా నను సాకుతావు కదూ?"** అని భరోసా కోరతారు.

***

**"ఎరుగవా నీవెప్పుడేమి యీవలయునో యడిగితిగాని నే నాగలేక"** అంటూ తన జీవన స్థితిని మరోమారు ప్రభువు దృష్టికి తెస్తారు కవి. "ఒకనాడు విందు – వేరొకనాడు మందుగా; ఒకనాడు హెచ్చు – వేరొకనాడు లొచ్చుగా; ఒకనాడు డోలి – వేరొకనాడు జోలిగా; ఒకనాడు నవ్వు – వేరొకనాడు నొవ్వుగా" సాగిస్తున్న తన జీవయాత్ర కేవలం పరమాత్మ విలాసంగా అభివర్ణిస్తారు.

కానీ, తలదన్నే వారి పాదములపై పడి; అలిగెడి వారిని అనునయించి; ఎదరించే వారికి ఏటికోళ్ళు ఘటించి; చెరచు వారికి దోసిళ్ళు పట్టి; బెదరించు వారికి ప్రియము గొలిపి – ఇలా ఎల్లవేళలా ఆత్మహానితో నీచుల అడుగులకు సిగ్గువిడచి మడుగులొగ్గి, ఒదిగి నేనెంత కాలం ఉండాలి? అని వాపోతారు.

***

**చూడు మని, చూపు మనియు, మాటాడు మనియు**
**నేలుకొను మనియును మొర్ర లిడుదు గాని**
**యన్నియును జేయుచుంటివీ వద్భుతముగా** అని, స్వామి వహిస్తున్న సర్వ కార్యభారానికి తన కృతజ్ఞతలనర్పిస్తూ 'నీవు అడిగించినదే, నేను అడుగుచున్నాను. నీవు నడిపించినట్లు నేను నడుచుచున్నాను. నీవు పలికించినట్లు నేను పలుకుచున్నాను. ఓ దోషరహిత! నాలో దోషమెంచకు' అని ప్రాధేయపడుతూ లోకహిత కర్తగా, సర్వలోకైక భర్తగా స్వామిని కీర్తిస్తారు.

***



స్వామీ! కన్నీట నీ కాళ్ళు కడుగుదామంటే నీవు నా కనుల ఎదుట నిలువవు. కాంక్ష తీరగా నిన్ను కౌగిలించుకుందామంటే నీవు నా బాహాగ్రములకు అందవు. నేనే, నీ మూర్తిలో నిల్చిపోదామంటే నాకు ఎప్పుడూ యిసుమంత చోటియ్యవు. **నీవు నా హృదయ పీఠమున ఒకింత నిశ్చలముగ నిలిచేది; సంతసముగా నీకు నేను స్వాగతమిచ్చేది; హృదయ పద్మంబుతో నేను నీకు పూర్ణభక్తితో పూజచేసేది; హృదయము నీకు అర్పణచేసి పానకముగా నివేదించేది; (ఇక్కడ హృదయ ద్రవీభవనాన్ని సూచించడం కవి ఉద్దేశ్యం కావచ్చు) – అలాంటి ఆనంద దినమును ఏడాది కొకటైనా కలిగించుమని** అర్థిస్తారు.

"ముకుంద మాల"లో కులశేఖరులు "ఎల్లపుడూ మనస్సుతో నీ పాదార విందాలను ధ్యానిస్తూ, ఆనందం అనుభవిస్తూ, చేతులు జోడించి, శిరస్సు వంచి నమస్కారం చేసేటట్లును, కంఠం గద్గదమయ్యేటట్లును, శరీరం పులకాంకితమై ఉండేటట్లును, కన్నులు ఆనంద బాష్పాలతో నిండేటట్లును, మేము జీవించి ఉన్నంత కాలము ఎడతెగక ఇలానే జరిగేటట్లుగా అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నాను" అని స్వామికి ఈ విన్నపాలనే చేస్తాడు.

**బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః**
**కంఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణ బాష్పాంబునా**
**నిత్యం త్వచ్చరణారవిన్ద యుగళ ధ్యానామృతాస్వాదినా**
**మస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితమ్.**

***

**అయితే, ఆ అనుగ్రహం పొందేందుకు కీలకమూ నువ్వే చెప్పాలి** – ఏ త్రోవలో నిను చేరుకోవచ్చునో చెప్పు. ఆ దారిలోనే పయనిస్తాను. ఏచోట స్థిరముగా నీవు ఉంటావో ఎరిగించు, అక్కడికే వస్తాను. ఏ వేషములో నువ్వు నన్ను ఇష్టపడతావో చెప్పు ఆ వేషమునే ధరిస్తాను. ఏ మాటలు నీకింపుగా ఉంటాయో తెలుపు. వాటినే నేను పలకనేర్చుతాను అని అనుగ్రహప్రాప్తికి అవసరమైన మార్గదర్శనాన్ని కోరతారు కవి.

**"వెలుపల నీవె లోపల నీవె నీ విహారమున కే యభ్యంతరమును లేదు" అని ఆహ్వానం పలుకుతూ** "భావములోన బాహ్యము నందున గోవింద గోవిందయని కొలువవో మనసా!!" – అన్నమయ్య గానాన్ని; 'అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః' – మంత్ర పుష్పసారాన్ని స్ఫురింపచేస్తారు.

**నువ్వు వస్తే, "ఆనందబాష్పపూరామృతసరసిలో నోలలాడింతు రావోయి రమ్ము!"** ఇంతేనా! భావడోలికమీద పవళింపచేసి ఉయ్యాలలూపుతాను. అమలినమైన నా ఆత్మగృహంలో సయ్యాటలాడిస్తాను; ఇంత గారం చేస్తున్నావు. ఎంత బతిమాలు కొన్నా, రాకున్నావు. పసిపాపలా అలుక బూనిన నీకు "భక్తి కలకండ" ఇస్తాను రా, అని పిలుస్తారు. ఇక్కడ అమలినమైన నా ఆత్మగృహం అనటంలో కవికి తన పవిత్రతపై గల విశ్వాసం ప్రస్ఫుటమవుతుంది. "నీ విద్యుత్ స్పర్శ నా సమస్తావయవాల్ని తాకుతోందనే జ్ఞానంతో నా దేహాన్ని ఎప్పుడూ పవిత్రంగా ఉంచటానికి యత్నిస్తాను" అని టాగూర్ అన్నట్లు భగవతదనుగ్రహసిద్ధికి ప్రధాన అర్హత పవిత్రత మాత్రమే అని ఈ సందర్భంలో విస్పష్టమవుతుంది.

స్వామి వచ్చి చెయ్యవలసినది ఏమిటి? ఒకటే – **చెట్టు కొమ్మల పూలు పుట్టించునట్లు భక్తిని; పూవు లోపల పిందెను పొడమించునట్లు శక్తిని; కాయలోపల విత్తు గలిగించునట్లు రక్తిని;** విత్తనంబున మొల్క వెడలించునట్లు ముక్తిని నా మనసులో నాటు ప్రభూ! అని తన ఆకాంక్షను వెలిబుచ్చుతారు కవి.

ఇంతలా వేడినా, స్వామి రాక పోవడంతో విసిగి మన మనసులను ఆర్ద్రం చేస్తూ **"తుదకు నిన్జూడకే దుఃఖించి దుఃఖించి పోదు నేమో చుమీ పొల్లవోయి!"** ఈ లోపలే నీ దర్శనమో, దయో, జ్ఞానమో, నీ సన్నిధాన గతియో, ఇచ్చి రక్షించు. చచ్చి సాధించే శక్తి నాకు లేదంటారు.

***

**"కవిననుకొని నిన్ను గడుసు పోకడలతో వర్ణించాలనుకొంటాను; గాయకుడిని అనుకొని కంఠం సవరించి నీ గురించి పాడదామనుకొంటాను; వేదాంతినని నిర్విషయచిత్తుడనై నిను చూడాలని ఉత్సాహపడతాను; చిత్రకారుడనని**



**నీ రూపాన్ని చిత్రిద్దామనుకుంటాను"** నా ఆత్మశక్తిని ఎరుగక అన్నిటికీ తగదునంటూ ఊహించి తుదకు ఏమీ చేయలేకపోతాను – నా తలపులుగని నవ్వుకోకు – అంటూ "వాచామ గోచర మనేక గుణ స్వరూపం" అని స్తుతించిన విశ్వనాథాష్టకాన్ని; "తవపి తవ గుణానాం ఈశ పారం నయాతి" అని కీర్తించిన పుష్పదంతుని (శివమహిమ్న స్తోత్రం) గుర్తు చేస్తారు.

చివరగా, కంచెర్ల గోపన్న "నా రచనకు పూత వృత్తి సుకరంబుగ జేకురునట్లు" అని ప్రార్థించినట్లు పరుసవేది తాకితే పనికిమాలిన ఒక ఇనుపముక్క బంగార మవుతుంది కదా! జలశూన్యమై ఉన్న చవిటి పఱ భాగీరథీ స్పర్శ వలన ఫలవంత మవుతుంది కదా! మరి నీకు అర్పించునట్టివి కాబట్టి ఈ సీసంబులు (116 సీస పద్యాలు) సువర్ణములు కాకుండా పోతాయా? అని ముగిస్తారు.

నిజమే, ఇవి దూరాన నిలిచిన మనలను సన్నిధికి చేరువకమ్మని పిలుస్తాయ్. కొన్నిసార్లు చేయిపట్టి నడిపిస్తాయ్. అందుకే, అందజేయబడిన ఈ 'ఉపాయనం (కానుక), అందించిన శ్రీ వేంకట రామశాస్త్రి ఆధ్యాత్మిక జీవనం – ఆత్మ, పరమాత్మల సంలీనానికి ఆలంబనగా నిలుస్తాయ్.


- **1927లో తొలిముద్రణ పొందిన ఈ గ్రంథం వేంకట రామకృష్ణ కవుల శతజయంతి సందర్భంగా 1983లో పునర్ముద్రణ పొందింది.**
- **పై సమీక్ష "సీనియర్ సిటిజన్ వాణి" అక్టోబర్-2014లో ప్రచురితం.**
- **15 నవంబర్, 2014న పల్లెపాలెం "ఆంధ్రీ కుటీరం"లో శ్రీ ఓలేటి వేంకట రామశాస్త్రి గారి జన్మదిన సందర్భంగా ప్రసంగం.**

# 2 మునిమాణిక్యం కథలు - మానవ సంబంధాలు

సాహిత్య రూపాలన్నిటిలో, మానవ జీవనంతో అత్యధికంగా పెనవేసుకున్నవి – రెండు. అవి ఒకటి కథ, రెండు పాట. వీటిలో జీవిత అంశాలన్నిటిని తనలో పొందుపరుచుకోగలది, విషయానుగుణంగా ఒదిగిపోగలది, నిడివిపరంగా సంకోచ, వ్యాకోచాలకు అవకాశమిచ్చేది – ఒక్క కథేనేమో! నిజానికి, ఏమనిషి జీవితంలోనైనా కథావస్తువుగా పనికిరాని సంఘటన ఉంటుందా? అందుకే, కథ మనిషి జీవితంలో అంతర్భాగం అనడం కన్నా, ప్రతి వ్యక్తీ సువిశాల కథాప్రపంచంలో అంతర్భాగమైన ఒక పాత్ర అనడం సమంజసమనిపిస్తుంది. వాస్తవ జీవితంలో సాధ్యంకాని కాల్పనిక విషయాలకూ కథలలో చోటుంటుంది. ఒక కథ వ్యక్తికి లక్ష్యాన్ని నిర్దేశిస్తుంది. మరొకటి మార్గదర్శిగా నిలుస్తుంది. ఇంకొకటి గతి తప్పకుండా నియంత్రిస్తుంది. వేరొకటి గమ్యానికి చేరుస్తుంది. అందుకే జీవనపర్యంతం కథ మనిషికి తోడుగా నిలుస్తుంది.

వర్గీకరణపరంగా హాస్యకథల విభాగానికి సమీపంలో ఉన్నా, వ్యక్తిత్వ వికాసానికి, మానవీయ విలువలకు ప్రాధాన్యతనిస్తూ, కుటుంబ జీవనంలో లభించే రసానుభూతులన్నిటినీ చమత్కారంతో రంగరించి అంతర్లీనంగా సందేశాన్నందించే అద్భుతకథలు – శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి కాంతం కథలు. స్థాలీపులాక న్యాయంగా "తెలుగు హాస్యం", "కాంతం కాపరం" పేరిట లభ్యమవుతున్న కథా సంకలనాలలో ఒక ఏడింటిని చెప్పుకుందాం.

**మా గృహ నిర్మాణం :**

అద్దెఇంటిలో అవస్థలు పడలేక సొంతంగా ఇల్లు కట్టుకోవాలనుకున్న రచయిత, తన స్నేహితుడు 'శిరోమణి' దృష్టాంతాన్ని ఉపకథగా తెలియజేస్తారు. 'నలోపాఖ్యానం' తెలియనిదే పాండవ అరణ్యవాస కథ చెప్పలేనట్లు అసలు శిరోమణి గురించి చెప్పకుండా సొంత ఇంటినిర్మాణం గురించి మాట్లాడలేమంటారు. నివేశన స్థలము, తగినంత సొమ్ము ఉన్న శిరోమణి అతి తక్కువ ఖర్చుతో అన్ని సౌకర్యాలూ



గల ఇంటి నిర్మాణం కోసం అనేక పుస్తకాలు చదువుతాడు. వివిధ దేశాల నిర్మాణ రీతుల గురించి గ్రంథాలను సేకరించడంతో మొదలై, అది కాస్తా పరిశోధన స్థాయికి చేరుకుంటుంది. ఎవరు ఇల్లు కట్టాలన్నా శిరోమణిని సంప్రదించి తీరాల్సినంత ప్రఖ్యాతిని పొందుతాడు. తాను తెలుసుకున్న విషయాల ఆధారంగా వ్యాసాలు రాయడం; సృష్ట్యాదినుండీ ఈ ప్రక్రియలో విశేషాలను పొందుపరచడం; నిర్మాణం గురించేకాక 'ఈస్తటిక్స్ ఆఫ్ హోం', దాని మూలాల అన్వేషణ, అటునుండి వాస్తు, ఆపై జ్యోతిషం . . . . ఇలా ఉన్న డబ్బంతా ఈ అభ్యాసానికి, జ్ఞానాన్వేషణకి ఖర్చు కావడంతో అసలు నిర్మాణం సున్న అవుతుంది.

ఇక రచయిత విషయానికి వస్తే, కట్టబోయే ఇంటిలో తనకు ప్రత్యేకంగా గది కావాలని అమ్మాయి, అత్తారింటికి పోయే నీకెందుకు? నాకే గది అవసరమని అబ్బాయి వాదించుకొంటుంటే; సింహద్వారము, పడకగది ఎటువైపు ఉండాలి? పెరట్లో ఏ మొక్కలు పెంచాలి? అని రచయిత తర్జన భర్జన చేస్తుంటే; చేతిలో చిల్లిగవ్వ లేకుండా ఎలా కడతారని కాంతం ప్రశ్నిస్తుంది. అప్పుచేసి, ఆ డబ్బుతో ఇల్లుకట్టి, సొంతిల్లు అద్దెకిచ్చి, ఆ అద్దెతో నెలనెలా అప్పు తీరుస్తానంటారు రచయిత ధీమాగా. కాంతం వెక్కిరింతలు, ఇరువురి మధ్య దెప్పిపొడుపులు, ఒకరివైపు వారిని మరొకరు నిందించుకోవడం – కథలో పాఠకుడిని మురిపింపచేసే అంశాలు. ఈ సందర్భంలో చేతిలో కొంతైనా సొమ్ము లేకుండా గాలి మేడలు కడుతున్న భర్తను, కాంతం వ్యంగ్యంగా **"ఒకాయన అన్నాట్ట, తమలపాకులు ఇన్ని ఏ వెధవైనా ఇస్తే బాగుండును; వక్కలకు ఏం భాగ్యం? ఎవర్ని అడిగినా రెండు ఇస్తారు. సున్నం గోడకు గిల్లి రాచుకోవచ్చు"** అంటుంది.

ఇలా, ఒకవైపు వినోదంతో పాటు మరోవైపు శిరోమణి దృష్టాంతం ద్వారా ప్రణాళికా రచనలో మితిమీరిన కాలయాపన, అమలులో జాప్యం కార్య సాఫల్యానికి ఎలా అవరోధం కలిగిస్తాయో; లక్ష్యంపై నిలపాల్సిన దృష్టి విచలనం పొందితే అది గమ్యం నుండి మనలను ఎంత దూరంలో నిలుపుతుందో సోదాహరణంగా సూచన చేస్తారు. నేల విడిచి సాము చెయ్యరాదని కాంతం మాటల ద్వారా తెలియజేస్తారు.

## The Perfect Wife :

'ప్రఫుల్లచంద్ర ముఖర్జీ' వంటి ప్రసిద్ధ చిత్రకారులు "విరహిణి" మొదలైన భంగిమలలో గీసిన చిత్రపటాలను ఇంటినిండా అలంకరించి; త్రిభంగి, మృగశీర్షిక వంటి భంగిమల గురించి; "ది యంగ్ హోస్టెస్; ది పర్ఫెక్ట్ వైఫ్" చిత్రాలు, ఇరవై నాలుగు హస్త జాతులు, ముద్రా విశేషాలు, వీటన్నిటినీ బోధించి; జాగ్రత్తగా పరిశీలించి, మాట్లాడేటపుడు, పడుకున్నపుడు, కూర్చున్నపుడు వాటిని అనుకరించమని రచయిత కాంతానికి సూచిస్తారు.

ఐతే, ఆయన తిరిగివచ్చేసరికి బోధించిన ఏ పద్ధతిలోనూ లేకుండా మామూలుగానే ఉండిపోతుంది కాంతం. **"ముక్కుతీరులో గాని, పెదవుల కుదిరికలో గానీ, కళ్ళ సౌందర్యంలో గానీ, ఆమెలో లోటు నాకు ఏమీ కనిపించలేదు. వస్త్ర ధారణలో కొంచెం శ్రద్ధ, చూపులలో రవ్వంత తీవ్రత ఉండి ఆమె హృదయ అంతర్భాగంలో ఉన్న భావాలు ప్రతి అవయవము వ్యక్తపరిచేటట్లు చేస్తే ఆమె పూర్తిగా రతీదేవి అయిపోను."** ఈ వాక్యాల ద్వారా రచయిత సౌందర్యారాధన, భార్య రూపురేఖా విలాసాలలో ఆయన ఆశిస్తున్న అంశాలు మనకు స్పష్టమవుతాయి.

ఎన్నిసార్లు చెప్పినా మార్పు రాకపోవడంతో ఆమె తనను తృణీకరిస్తోందనే భావనతో గట్టిగా మందలించబోతాడు. అపుడు కాంతం **"మీరేం ఫోజు ఇచ్చారు? ఏం హస్తాలు పట్టారు? ఏ చిత్రాన్ని అనుకరిస్తున్నారు? అంటే కోపం గాని, ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పండి.**

**మీరు ఇంటిలోకి రావటంతోనే, రాజు వెడలెను అనే పద్ధతిలో హాలులో కాసేపు ఎగిరి దొడ్లోకి రండి. దాని తరువాత "ది పర్ఫెక్ట్ హజ్‌బెండ్" అనే బొమ్మను అనుకరిస్తూ నిలుచోండి. సింహతలాట హస్తం పట్టండి – మీరు అలా చేస్తే, నేనూ మీరు చెప్పినట్టే వింటాను. అయితే ఒకటి, ఏమి చెయ్యకపోయినా, నా కళ్ళకు మీరు మన్మధుడిలాగ కనబడుతున్నారు"** అని ప్రశ్నిస్తుంది, ఆయన మెడపై చేతులు వేసి బ్రహ్మాండమైన అర్థాన్ని మెత్తని మాటలతో మాటుపెడుతూ.



ఇంతవరకూ కేవలం ఇరువురి సంభాషణలుగా నడిచిపోయిన కథ, పై సన్నివేశంలో పతాక స్థితికి చేరి పాఠక హృదయాన్ని కట్టిపడేస్తుంది. "నిన్ను, నిన్నుగా ప్రేమించుట" – దాంపత్యానికి మూలభావనగా రచయిత ప్రతిపాదించినట్లవుతుంది. మరునాడే, కాంతం ఒత్తిడితో ఆ చిత్ర పటాలన్నీ వెనుకకు ఇచ్చేయడానికి బండిలో వేసుకుని బయలుదేరుతారు రచయిత. **"ఎత్తు పల్లాలు కలిగి, దుమ్ములో నుండి మేకుల్లాగ, కాళ్ళలో దిగబడే కంకరరాళ్ళు ఉన్న ఆ రోడ్డుపైన, బండి నడుస్తూ కట కట శబ్దం చేస్తున్నా, ఆ జీవితానికి అలవాటు పడి, అందులోనే ఆనందాన్ని అనుభవించడం నేర్చుకున్న గుర్రం మహా హుషారుగా ఎగురుతూ సకిలిస్తూ తన యజమాని వేసే ఈలలకు పరవశత్వం పొందుతూ పరుగెత్తింది"** – ఈ వాక్యాలు రచయిత హృదయాన్ని ఆవిష్కరిస్తాయి. రసికతకు ప్రాధాన్యమీయని భార్యను, ఆమెతో అలవాటుపడి జీవిస్తున్న తనను ప్రతీకాత్మకంగా చెబుతూ సర్దుబాటులోగల సౌందర్యాన్ని తెలియజేస్తారు.

**మొండి వాదన :**

తొందరపనిమీద ఒంగోలు వెళ్లాలని, బట్టలు సర్దమని కాంతానికి చెప్పి స్కూలుకి వెళ్ళిపోతారు రచయిత. సాయంత్రం వచ్చాక హడావుడిగా 'సర్దావా?' అని అడిగితే 'ఎంతసేపు, మీరు స్నానం చేసేప్పటికి సర్దలేనా?' అంటుందామె – ఎంతో నింపాదిగా. ఉదయమనగా చెబితే ఏంచేసావంటే? బట్టలుతికి, పిల్లల భోజనాలు చూసి, మహాలక్ష్మమ్మగారితో మాట్లాడి.... ఇలా పనుల చిట్టా విప్పుతుంది. కంగారుగా భోంచేసి సర్దడం పూర్తయిందా? అని బయలుదేరబోతుంటే అప్పుడు – కావిడి పెట్టెలోంచి ఒక్కొక్కటి బయటకు తీసి ఇది కావాలా? లేక ఇది కావాలా? అని అడుగుతుంది. ఇంతలో ఈ ఉత్తరీయం సర్దు అని రచయిత చూపిస్తే; అదివద్దు, మీరు పారేస్తారని గతంలో ఆయన ఊరెళ్ళినపుడు పారేసినవన్నీ గుర్తుచేసి కోపాన్ని పెంచేస్తుంది.

మరో ఉత్తరీయాన్ని పిల్లకి పేరంటంలో ఓణీగా వేద్దామని అట్టిపెట్టా నంటుంది. ఇక తొందరగా బయటపడి బండికోసం పిలుస్తుంటే ఎంతో శ్రద్ధగా అప్పటికే సర్దిఉంచిన ఊరగాయి సీసా ఇచ్చి గుంటూరులో వాళ్ళ అక్కయ్యగారికి

ఇమ్మంటుంది. బందరు నుండి ఒంగోలు పోయే దారిలో గుంటూరు తగలదని రచయిత ఎంత చెప్పినా వినిపించుకోకుండా **'ఆ తగలకేంలెండి, ఆపేక్షలుంటే బాగానే తగులుతాయి'** అని నిష్ఠూరంగా మాట్లాడుతుంది.

కుటుంబ వ్యవస్థలో భార్యగా స్త్రీ నిర్వహించే పనులలో ఏ అంశమూ తీసిపారేయ్యలేనిదే. అయితే, అత్యవసర సమయాలలో గృహిణికి పనుల ప్రాధాన్యతా క్రమాన్ని నిర్ణయించుకునే విజ్ఞత అవసరం. సమయసారణి (టైం టేబుల్)ని సమర్థవంతంగా రూపొందించి, నిర్వహించగల గృహిణి ఆదర్శ కుటుంబ నిర్మాత కాగలుగుతుంది. అలాగే, కేవలం పని సూచించి వెళ్ళిపోకుండా, దాని ఆవశ్యకత, అత్యవసరతను వివరిస్తే ఇలాంటి సన్నివేశాలు ఎదురుకావు. అవతల వ్యక్తి స్థితిని అర్థం చేసుకోకుండా చేసే దెప్పిపొడుపులు, నిష్ఠూరాలు వారిలో సహనాన్ని పరీక్షించి విసుగును, కోపాన్ని పెంచి ఒక్కొక్కసారి బంధాల విచ్ఛిత్తికీ దారితీస్తాయి.

**ఇరుగు - పొరుగు :**

నిజానికి ఇది కేవలం రచయిత మనతో పంచుకుంటున్న భావ ప్రవాహం. ఐతేనేం! బోలెడు ఆనందాన్ని కలిగిస్తూ గిలిగింతలు పెట్టే హాస్యం ముఖాలను వెలిగిస్తుంది. ఇరుగు-పొరుగుగా ఎలాంటివారిని ఎంచుకుంటే జీవితం ఎంత సుఖమయంగా సాగిపోతుందో చమత్కారంగా తెలియజెప్పటం ఈ కథ ఉద్దేశ్యం. కీర్తి, అపకీర్తి రెండూ ప్రక్కింటి వాళ్ళవల్లనే వస్తాయి. అందుకే వాళ్ళతో బహు జాగ్రత్తగా వ్యవహరించాలి – ఇదీ రచయిత సందేశం.

భార్య పుట్టింటికి వెళ్ళినపుడు 'నీవు ఒకరోజున స్నానం చేస్తూ వుండటం, అదే సమయంలో పొరిగింటి కోడలు పూలజడ వేసుకొని దొడ్డి గోడ మీదుగా తొంగిచూడడం; నీవు ఆ చక్కని పిల్లను నివ్వెరపోయిచూస్తూ అవతల వంటింటి గుమ్మంలో నుంచి ఆ అమ్మాయి అత్తగారు గుడ్లు మిటకరించి చూస్తున్నట్లు గమనించక పోవటం, ఇత్యాది విషయాలు జరిగినయ్యో, నీ ఖర్మంకాలిందే" అని హెచ్చరిస్తారు.

అలాగే, ప్రక్కవాళ్ళకు ఫోను, రేడియో ఉండేటట్లు చూసుకోవాలి. సాధారణంగా వెన్నలరాత్రులలో వాళ్ళు రేడియో పెట్టుకుని కూర్చుంటారు. ఆ



సమయంలో మనమూ కార్యక్రమాలను విని ఆనందించడమే కాక మర్నాడు ఆఫీసులో వాటి గురించి మాట్లాడుతూ రేడియో ఉన్నవాళ్ళలా హోదా వెలగబెట్టచ్చంటారు.

పక్కింటి వాళ్లకు పిల్లలు లేకపోతే (అంటే చిన్నపిల్లలు అని అర్థం సుమా!) వాళ్ళు మన పిల్లలనే ముద్దుచేస్తూ మిఠాయిలు పెడతారు. వాళ్లకి కారుంటే మనకు అపుడపుడు వాహనయోగం కలుగుతుంది. ప్రక్కావిడ ఫ్యాషన్ తెలిసిన మనిషైతే మన ఆడవాళ్లకు కట్టు, బొట్టు నేర్పుతుంది. మన పిల్లలను ముస్తాబు చేసే పనికూడా ఆవిడకే అప్పచెప్పాలి. వాళ్ళామెను అత్తయ్యా, అత్తయ్యా... అంటూ అక్కడే కాలం గడుపుతారు. అన్నిటికీ మించి పక్కవాళ్ళు కాస్త స్థితిపరులైతే కావలసినపుడు అప్పు పుడుతుంది.

ఇలా చెప్పుకునేందుకు సరదాగా సాగిపోతున్నా, నాటి కాలంలో ఒక మధ్యతరగతి కుటుంబీకుడి మానసికస్థితి ఈ కథ ద్వారా అర్థమవుతుంది. ఇక్కడ రచయిత తనకు గ్రామఫోన్, రేడియో, కారు ఇవేమీ కోరుకోవడంలేదు. కేవలం ప్రక్క వారికి ఉంటే అసవరమైనపుడు కాస్త ఆనందించాలని, అంతే! ఇది పరిధి దాటని కోర్కెలకు, అల్ప విషయాలకు సైతం ఆనందించగల సర్దుబాటుతత్వానికి తార్కాణం.

**ప్రయాణ సన్నాహం :**

హంపియాత్రకు అన్నీ సిద్ధం చేసుకున్న రచయిత – జీర్ణ కర్నాటక సామ్రాజ్య వైభవాన్ని, హంపి చూసి తీరవలసిన ఆవశ్యకతని కాంతానికి వివరించి, ఆమెచేత తప్పక చూడవలసినదే అనిపించి తన విజయానికి సంతోషిస్తాడు. అయితే మేమంతా వస్తాం. మా ఖర్మం ఏం కాలింది? చూడకపోవడానికి! అని బతిమాలుతుంది కాంతం. ససేమిరా అనడంతో పట్టుదల, అలక, వాదన ఇవన్నీ అయ్యాక సొంతంగా చూసొచ్చాక నీకవన్నీ వర్ణించి చెబుతాను కదా! అని ఆవిణ్ణి బుజ్జగిస్తాడు. ఆవిడ సరే అని వెంటనే అంగీకరించడంతో మళ్ళీ విజయగర్వంతో పొంగిపోతాడు. రేపటి నుండి నేను కూడా మీకు రోజు అన్నం పెట్టను. పిల్లలు, నేను వండుకు తినేస్తాం. మీరు రాగానే మీకు పదార్థాల గురించి వర్ణించి చెబుతాం – ఎదురుదెబ్బ కొడుతుంది కాంతం. ఇక లాభం లేదని తన ప్రతిభాపాటవ ప్రదర్శన ప్రారంభిస్తాడు రచయిత.

చూడు కాంతం! నారదుడు త్రిలోకసంచారి. ఎప్పుడయినా ఆయన భార్య ఆయన కూడా తిరిగిందా? నువ్వూ అలా మహాపతివ్రతలా ఉండాలి – అని మాయ చేసేందుకు ప్రయత్నిస్తాడు. చాల్లెండి, నాకు తెలియదనుకున్నారా? **నారదుడు బ్రహ్మచారి, అతనికి భార్య లేదు** అంది కాంతం తెలివిగా. అలా అని నీకెవరు చెప్పారు? అని ప్రశ్నిస్తాడు రచయిత. మొన్న గుళ్ళో మాఘపురాణం చెప్పినపుడు విన్నాను. ఇంతే కదా! **మాఘ పురాణం వ్రాసే కాలం నాటికి ఆయనకు వివాహం కాలేదు. దాని తరువాత మత్స్య, కూర్మ, వరాహాది పురాణాలలో ఆయన భార్య సంగతి ఉంది. ఆవిడ పేరు మత్స్యగంధి. అంతేనా! అర్జునుడు గుర్రాన్ని తీసుకుని విదేశాలకు పోతే ద్రౌపది ఇంట్లో పడుకోలేదా? ఊర్మిళ 12 ఏళ్ళు ఇంట్లోనే నిద్రపోలా.** .. ఇలా ఉదాహరణలతో ఉపన్యాసం మొదలుపెడతాడు రచయిత. "అందరి గురించీ చెబుతారు సరే, సీత గురించి చెప్పరే?" ఎదురు ప్రశ్న వేసింది కాంతం. ఇంకేం ఉంది! ప్రయాణం ఆగిపోయింది.

లోకజ్ఞానం, పరిసరాల విజ్ఞానం పురుషులతో సమానంగా స్త్రీలకూ అవసరమే. కేవలం ఆర్థిక ఇబ్బందులో, ఏ ఇతర కారణాలో సాకుగా చూపకుండా కాస్త ఓరిమి, ఇంకాస్త సర్దుబాటు అలవరచుకుంటే కుటుంబ సమేతంగా ఇలాంటి విహారయాత్రలు చెయ్యడం ఏమంత కష్ట సాధ్యం కాదు. అన్యోన్య దంపతుల మధ్య సైతం ఇలాంటి సున్నిత విషయాలు ఎలా అలజడికి, అలకలకు కారణాలౌతాయో రచయిత తెలియజేస్తారు.

**పిల్లలు గల తల్లి :**

ఈ కథలో కాంతం చివరి క్షణాలను మన ముందుంచుతారు రచయిత. పది రోజులు తీవ్ర అనారోగ్యంతో బాధపడిన కాంతం; ఆ స్థితిలోనూ భర్తను భోంచేసారా? అని పదే పదే అడగడం; నా కోసం ఆలోచిస్తూ మీరు అసలు మీ ఆరోగ్యం పట్టించుకోవడం లేదని బాధపడడం; మీ చెల్లాయికి మనం తాగే కాఫీ సహించడం లేదు, గుండు కాఫీ గింజలు తెప్పించండి అని గుర్తు చేయడం; నా వైద్యానికి తెనాలి నుండి డాక్టరుగారిని రప్పిస్తున్నారట, వారికి ఏమయినా ఫలహారం తెండని సూచించడం; పిల్లలు ఆడుకుని వచ్చి ఏమయినా పెట్టవే అమ్మా అని



అడుగుతారు, అత్తగార్ని కాస్త ఏమైనా చెయ్యమనండి – ఇవీ అంత్య దశలో భారతీయ గృహిణికి ప్రతిబింబంగా రూపొందించిన కాంతం పాత్రతో రచయిత పలికించిన మాటలు. అత్తగారికి పిల్లలను అప్పగించి; పిల్లాడు నిద్ర పోకపోతే మేక కథ చెప్పండి అని భర్తకు చెప్పి; రుక్కూ, మంగా, శాస్త్రీ, రాధా, విజయా అని పేరుపేరునా పిల్లలను పిలిచి అతికష్టం మీద రెప్పలెత్తి వాళ్ళను చూసి కళ్ళు మూసింది అని కాంతం పాత్రను ముగిస్తూ **"నా పిల్లలకు తల్లి లేకుండా పోయింది. నా కాంతం ప్రపంచానికంతా అయిపోయింది"** అని ఇన్ని కథలతో పారవశ్య అలలపై ఊగిసలాడుతున్న మన మనసు పడవను ఒక్కసారిగా దుఃఖసాగరంలో ముంచెత్తుతారు.

**నిజం, నిజం :**

ఈ కథలో రచయిత ఇంట్లో ఉండి చదువుకుంటున్న అతని స్నేహితుడు రంగయ్య కొడుకు 'శీను' నాలుగు రోజులు వాళ్ళింటికి వెళతానంటాడు. 'మొన్న దసరాకే కదరా వెళ్లావు. పైగా సెలవులు అయ్యాక ఆలస్యంగా వచ్చావు. మళ్ళీ ఇపుడు ఎందుకు' అని నిరాకరిస్తారు రచయిత. 'మా నాన్న తప్పక రమ్మన్నాడు' అంటాడు శీను నమ్మకంగా. ఆ రోజు సాయంత్రమే రంగయ్య కనపడి, పిల్లాడిని మంచి మార్గంలో పెట్టమని మరోసారి అప్పగింతలు పెట్టి తాను శీనుని రమ్మన లేదంటాడు. ఇక, శీనుకి చివాట్లు పెట్టి జ్ఞానబోధ చెయ్యాలని నిర్ణయించుకుంటాడు రచయిత. ఒక్కడివీ ఎలా వెళతావురా? అని అడిగితే, ఫోర్త్ ఫారం చదివే మా ఊరి కుర్రాడు సీతయ్య కూడా వస్తానన్నాడని తడుముకోకుండా సమాధానమిస్తాడు. మర్నాడు వాడు మళ్ళీ అడగగానే హరిశ్చంద్రుడి కథ చెప్పి నీతిబోధ చేస్తాడు. ముఖ్యంగా సీతయ్య వంటి చెడు పిల్లల స్నేహంతోనే చెడిపోతున్నావని చివాట్లు పెడతాడు. వాడు ఏడుస్తుంటే కుర్రాడిని సన్మార్గంలో పెట్టగలిగానని, పశ్చాత్తాపం కలిగించ గలిగానని ఆనందిస్తాడు. కాసేపటికి జాలి కలిగి వాడిని బుజ్జగించాలని దగ్గరకు పిలిచి నిజం చెప్పమని అడుగుతాడు. 'నాయనా శీను! జున్ను తినకుండా వెడుతున్నావు. ఇంకొక్క రెండు రోజులు ఉండరాదురా, నీకు పెట్టకుండా మేము ఎలా తింటామురా?' అని వాళ్ళ అమ్మ మాటలను చెబుతూ, తలుచుకుంటూ ఏడుస్తాడు శీను.

అయ్యో! పసివాడిని అర్థం చేసుకోలేకపోయానని బాధపడి వెంటనే ప్రయాణం కమ్మంటాడు. దారిలో మరింత ఉపదేశం చేద్దామని "నీవు ఇకనుండి బుద్ధిమంతుడిలా ఉండాలి. ఆ సీతయ్య వట్టి వెధవ" ఇంతలో, శీను ఏదో చెప్పబోతే 'వాడు నాకు తెలియదు అనుకున్నావా? వాడి మాస్టారు కూడా నాకు వాడి దుర్మార్గాల గురించి చెప్పాడు' అంటాడు. సీను ఏడుస్తూ అంతా వట్టిదే మావయ్య అని ఏదో చెప్పబోతాడు. వెధవా, నాకు వాడి గురించి తెలియదనుకున్నావా?... అది కాదు మావయ్య. అసలు సీతయ్య అనేవాడే లేదు. నేనే ఏదో పేరు చెప్పాను.

ఇక్కడ రచయిత రాసిన సంభాషణ :

**శీను బస్ పైకి ఎక్కాడు.**
**నేను క్రిందే నుంచున్నాను.**
**వాడు పైన, నేను క్రిందా ఉన్నాం.**
**వెళ్లిరా నాయనా, నేను చెప్పిన విషయం ఎప్పుడూ మరిచిపోకేం.**
**శీను తల ఊపాడు.**
**ఏమిటి నేను చెప్పింది?**
**ఎప్పుడూ అబద్ధం ఆడకూడదు మావయ్య. వాడు ముందుకు వెళ్ళాడు.**
**నేను వెనక్కు వచ్చాను.**

ఈ మాటల ద్వారా నైతికతలో శీను తనకంటే పైన, తాను అతని కింద ఉన్నామని; వాడు ముందుకు పోతుంటే తాను వెనుకబడ్డానని ధ్వనిమంతంగా చెప్పడం అత్యుత్తమ కథా రచనా శైలికి తార్కాణంగా నిలుస్తుంది.

***

"What makes a good story" అనే శీర్షికతో యువరచయితలకు కథా కల్పనపై అవగాహన కల్పిస్తూ 'Aaron Shepard' కొన్ని సూచనలు చేస్తారు. అందులో ముఖ్యాంశాలు – 'కథ మరీ నీతిబోధలా ఉండకూడదు; ఒకవేళ లక్ష్యం అదే అయినా, అది నేరుగా ఉండకూడదు; పాత్రల స్వరూప, స్వభావాలలో వైరుధ్యం ఎక్కువగా కనపడకూడదు. ఏవేవో పాత్రల ద్వారా, పేర్ల ద్వారా కాకుండా ఉత్తమపురుషలో



చెప్పడం ఉత్తమం. నాయకుడితో సహా ఏ పాత్రనూ పరిపూర్ణంగా లోపరహితంగా చూపకూడదు. పాఠకునికి పరిచితమైన భాష, ప్రదేశాలు, కాలంలోనే కథ నడపాలి. ముఖ్యంగా కథను చూపాలి. చెప్పకూడదు".

పై వ్యాసం ప్రకటింపబడిన కాలానికి సుమారు వందేళ్ళ క్రితమే వ్రాయబడ్డ శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి కాంతం కథలు ఈ లక్షణాలన్నీ కలిగి ఉన్నాయి. అంటే 'Aaron Shepard' సూత్రాలను బ్లూప్రింట్‌గా భావించి ఈ కథలను మూల్యాంకనం చేస్తే వందేళ్ళ తరువాత కూడా ఇవి వంద మార్కులూ పొందుతాయి. అందుకే విశ్లేషకుల అభిప్రాయంలో ఇవి ఉత్తమమైన కథలు; మనలాంటి పాఠకులకు ఉపయోగపడే కథలు.

* **4, ఆగష్టు 2013న "ప్రతినెల - సాహిత్య హేల"లో ప్రసంగం.**
* **ఫిబ్రవరి, 2015 "సీనియర్ సిటిజన్ వాణి"లో ప్రచురితం.**

# 3 | ‘కళాకేళి’లో కాసేపు...

**“నేనూ మీరు నడిచే భూమిపైనే నడుస్తున్నాను.**
**మీరు పీల్చిన గాలినే పీలుస్తున్నాను.**
**మీరు చూస్తున్న వెలుగునే పంచుకుంటున్నాను.**
**అయితే, ఈ మెదడు మీ మెదళ్ళ కంటే ముందునుండీ పనిచేస్తోంది అంతే తేడా.**
**ఇక వయసంటారా?**
**అది ఎవరిది వారిదే. దీనిని తగ్గించలేం. పెంచనూలేం.**
**అందుకే పలకరించేప్పుడు నమస్కరించడం కంటే మీ హస్తస్పర్శ నాకెక్కువ ఆనందానిస్తుంది.”** – ఇవీ, తొంభై వసంతాల సాహితీ వతంసులు డా. ఆవంత్స సోమసుందర్, పిఠాపురంలోని వారి స్వగృహం **‘కళాకేళి’**లో సాహితీ మిత్రులం కలసి సభక్తికంగా నమస్కరించినపుడు అన్న మాటలు.

***

ఈ సందర్భంలో ఒక ప్రత్యేకమైన ప్రశ్నావళిని సిద్ధం చేసుకోని కారణంగా అప్పటికప్పుడు అడిగిన ప్రశ్నలు, సందేహాలకు వారి ఆరోగ్యం సరిగా లేకపోయినా ఎంతో ఆప్యాయనంగా సమాధానమిచ్చారు. తన జీవన రేఖలన్నిటినీ ఇప్పటికే మొదటి భాగాన్ని **“కళలు-కన్నీళ్ళు”**గా; రెండవ భాగాన్ని **“పూలు-ముళ్ళు”**గా మన ముందుంచిన ఈ సాహితీస్రష్టతో జరిగిన సంభాషణను వివిధ సందర్భాలలో వారి పుస్తకాలలో, ఇంటర్వ్యూలలో వెలిబుచ్చిన అభిప్రాయాలతో అన్వయిస్తూ సాహితీ ప్రియులకు అందజేయడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం.

***

**పరిశోధకుల భిన్నాభిప్రాయాలు :–** ప్రాచీన కవుల కాలాలు, ప్రాంతాలు; అలాగే కొన్ని గ్రంథాల రచయితల గురించి పరిశోధకుల అభిప్రాయాలు భిన్నంగా ఉన్నాయి. ఈ భేదాలకు కారణమేమైఉంటుందని అడిగినపుడు ఎంతటి లబ్ధప్రతిష్టులైన పరిశోధకులయినా, శాస్త్రకారులయినా ఒక విషయాన్ని గురించి సమాజానికి ప్రకటింప



దలుచుకున్నపుడు ఖచ్చితమైన ఆధారాలను చూపాలని; లేకుంటే, తాత్కాలికంగా ఆ వ్యక్తిపై గల విశ్వాసంతోనో లేక గౌరవంతోనో అతని ప్రతిపాదన అంగీకరింపబడినా అనంతర కాలంలో మళ్ళీ ప్రశ్నలు తలెత్తి, వారు చేసిన ఇతర పరిశోధనల ఫలితాలపై కూడా విశ్వసనీయత సన్నగిల్లుతుందన్నారు. కొందరి విషయంలో సరైన ఆధారాలు లేకున్నా ఆ శాస్త్రకారుని శిష్యగణం / అనుయాయులు ‘అంతరుద్బోధం’ అని భావించి అనుసరించినా, ఇతర వర్గాలు వాటిని విస్మరిస్తాయన్నారు.

ఆశ్వాసాంత గద్యలలో కవులు వారి వ్యక్తిగత విశేషాలను, సాహిత్య కృషిని అందజేసిన దృష్ట్యా, వాటిని సాహిత్య చరిత్రకు అత్యంత ఆవశ్యకంగా మనం పరిగణించాలని; కవి కాలాదులకు సంబంధించిన విచికిత్సలు ఏర్పడినపుడు ఇవి ఎంతగానో ఉపకరిస్తాయని; అందుకే, సాహిత్యంతో పాటు వాటికీ సమానమైన ప్రాధాన్యతనివ్వాలని అభిప్రాయపడ్డారు.

**అగ్ర తాంబూలం :–** తెలుగు సాహిత్యంలో తిక్కనదే అగ్రస్థానమన్నారు శ్రీ సోమసుందర్. నాటకీయత ప్రధాన బలంగా సాగిన వారి శైలిని అనంతర కవులు కనీసం అనుకరించలేపోయారని, **నాచన సోమన** కొంతవరకు కృతకృత్యుడు కాగలిగాడని చెబుతూ తిక్కన లేనిదే తెలుగు కవిత్వం లేదని పునరుద్ఘాటించారు.

**భావితరాలకు అందని భాషా సౌందర్యం :–** నేటి తెలుగుభాష బోధన – పరీక్షలలో ఉత్తీర్ణతే ధ్యేయంగా సాగుతోంది. సాహిత్య విద్యార్థులు సైతం పద్యాలను బట్టీ వేస్తున్నారు. అధ్యాపకులు యథాతథంగా అర్థవివరణ చేస్తున్నారు కానీ, విద్యార్థిలో వివేచన కలిగించటానికి, అంతర్లీనంగా గల కవిహృదయాన్ని అవగతం చేసుకోవటానికి ప్రయత్నం జరగటంలేదు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ శ్రీ సోమసుందర్ ప్రస్తుత స్థితిలో మార్పు వచ్చినపుడే భాషా పునర్వికాసం సాధ్యమవుతుందన్నారు.

అందుకు ఉదాహరణలిస్తూ **“చేర్చుక్కగా నిద్ద చిన్ని జాబిల్లిచే, సిందూర తిలకంబు చెమ్మగిల్ల............ వింతరంగు లీన. నుపనిషత్తులు బోటులై యోలగింపఁ ........... వెలయుఁగాత!”** పద్యంతో చక్కని సమన్వయం చేసారు. ఈ పద్యంలో ఉష్ణగుణానికి ఉద్దీపన కలిగించే సిందూరం శీతల తత్వానికి ప్రతీకగా నిలిచే చంద్రవంకలో ఒదిగేటప్పటికి చెమ్మగిల్లినట్లు కవి వర్ణించాడు. **“మను చరిత్రము”**లో

ఇష్టదేవతా వందనములోని పై పద్యంలో పెద్దనార్యుని చమత్కృతి వ్యక్తమవుతుంది. పాఠ్య ప్రణాళిక పరిధి దాటి ఇలాంటి విషయాలు కళాశాల, స్నాతకోత్తర స్థాయిలో విద్యార్థులకు బోధించాలన్నారు.

**సామాజిక స్వరూప స్వభావాల వాహికగా సాహిత్యం :-** సాహిత్యాన్ని ఆ రచనలో పేర్కొనబడిన కాలము నాటి సామాజిక పరిస్థితులు, భౌగోళిక పరిసరాలు, రాజకీయ, ఆర్థిక, స్థితిగతులు వీటన్నిటిని భవిష్యత్ తరాలకు తెలియజేసేదిగా ఆనాటి కవులు రూపొందించారు. అందుకు అందమైన ఉదాహరణగా **"పాండురంగ మాహాత్మ్యం"**లోని ఈ పద్యాన్ని పేర్కొన్నారు శ్రీ సోమసుందర్.

**గంగా సంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా**
**నంగీకార మొనర్చునే యమునతో నానందముంబొందునే**
**రంగత్తుంగ తరంగ హస్తముల నారత్నా కరేంద్రుండు నీ**
**యంగంబంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ !**

నదులన్నీ సముద్రంలో సంగమించడం పరిపాటి. అయితే తుంగభద్రా నది సాగరం వరకూ సాగకుండా కృష్ణలో కలుస్తుంది. భౌగోళికమైన ఈ దృగ్విషయాన్ని కావ్యంలో పొందుపరచిన రామకృష్ణుని ప్రతిభకు తార్కాణంగా పై పద్యం ఆంధ్ర సారస్వతంలో శాశ్వతంగా నిలుస్తుందన్నారు.

అలాగే, నాటి చరిత్రను తెలియజేసే కావ్యంగా **క్రీడాభిరామా**న్ని కూడా పేర్కొంటూ, ఇది అంతటి ఉత్కృష్ట కావ్యమని చాలాకాలం వరకు వారికి తెలియలేదని, దశవిధ నాటక రీతులలో 'వీథి' అనే వర్గీకరణకు సంబంధించిన దీని ఔన్నత్యాన్ని ఏదో సందర్భంలో **శ్రీశ్రీ** చెప్పే వరకు తాను గుర్తించలేకపోయానన్నారు. ఈ వాస్తవ కావ్యం నాటి కార్మిక స్త్రీ, మేదరి స్త్రీ, చాకలి, దొమ్మరి ఇలా వేర్వేరు వృత్తులు, వ్యక్తులతో పాటు కోడిపందాల వంటి వినోదాలను వర్ణిస్తూ నాటి ప్రాచీన సమాజాన్ని మన ముందుంచుతుందన్నారు.

**పాత - కొత్త :-** పాతదంతా అనుసరణీయమనో, కాదనో తేల్చి చెప్పలేమని, ఈ విషయంలో మనం క్షీర, నీర న్యాయాన్ని పాటించాలన్నారు. నాటి ప్రబంధాలలో కమలాలను, తామరలను, సూర్య చంద్రులను ఇలా అనేక అంశాలను పదే పదే



పోల్చుతూ చేసిన వర్ణనలు కనిపిస్తాయి. ఈ ఉపమానాలలో పొసగనివీ ఎన్నో ఉన్నాయి. ప్రాచీన సాహిత్యంలో అలాంటి దృష్టాంతాలను పేర్కొంటూ **వాళ్ళు వ్రాసిన విషయాలలో మనం మనకు అర్థమైనవి మాత్రమే పదే పదే చర్చించుకుంటూ మిగిలినవి విస్మరిస్తున్నాం. ఇందుకు కారణం మన పరిమిత జ్ఞానం. ఒకే విషయాన్ని పట్టుకుని వేలాడుతున్నాం. వాళ్ళు తెలిసి వ్రాసారు, మనం తెలియక విడిచిపెడుతున్నాం** అని వ్యాఖ్యానించారు.

ఈ సందర్భంలో చాలా దశాబ్దాల క్రితం వారన్న **"పద్యంలో కొత్త పలుకుబడి అవకాశం లేనంతగా పీచుపీచుగా అయిపోయింది. గణ పూరణం ప్రధానమై భావం వక్ర మార్గం పడుతోంది. నవీన భావనకది పనికిరాదు"** అనే అభిప్రాయాన్ని మళ్ళీ వ్యక్తం చేసారు.

**కవి - సంస్కారం :-** "ఈ తరంలో తప్పిదాలను హుందాగా అంగీకరించడం; అలాగే, పెద్దల సూచనలను అమలు చెయ్యడం లోపించింది" అంటూ పదేళ్ళ క్రితం జరిగిన సంఘటనను గుర్తు చేసుకున్నారు. "ఒక సభలో ప్రముఖ పండితుడొకడు విషయాన్ని తనకు నచ్చిన రీతిలో వ్యాఖ్యానిస్తున్నాడు. నా కన్నా చాలా చిన్నవాడు. సాధికారంగా నీది తప్పు అని చెప్పగలిగినా నెమ్మదిగా దగ్గరకు పిలిచి, మీరన్నది సరికాదేమో? దాని అర్థం ఇదేమో? అన్నాను - సరి చేసుకుంటాడని; దానికి అతను ఏమాత్రం లక్ష్య పెట్టకుండా 'చూద్దాం లెండి' అన్నాడు. ఇక ఉండబట్టలేక చివాట్లు పెట్టడం జరిగింది. దానితో అది మరో సభగా, రభసగా మారింది. చివరకు మరొక పెద్దాయన జోక్యం చేసుకుని అతడిని తీవ్రంగా మందలించి 'సోమసుందర్ గారన్నది సత్యం క్షమాపణ కోరండి' అని హితవు చెప్పారు.

ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే తన ప్రతిభా పాండిత్యాల పట్ల ఆత్మ విశ్వాసం తప్పనిసరి, కాదనను. కానీ అదే రంగంలో ముందుతరం వారు సూచన చేసినపుడు ఆ దిశలో మరింత పరిశోధన, కృషి జరిపినప్పుడే లోపనివారణ సాధ్యమవుతుంది" అంటూ గుర్తు చేసుకున్నారు.

**సోమసుందర్ - సంగీతం :-** వారి బాల్యంలో అత్యంత సాన్నిహిత్యంతో వ్యవహరించిన మహానుభావులు, ప్రసిద్ధ వైణికులు **తుమరాడ సంగమేశ్వరశాస్త్రి** గారు వారింటి

దగ్గరలో ఉండేవారట; శాస్త్రిగారి అవసాన దశలో సోమసుందర్ తల్లిగారు వారికి సేవ చేయమని తరచూ పంపేవారని జ్ఞప్తికి తెచ్చుకున్నారు. శాస్త్రిగారు వీణను 'అమ్మ' అనే వ్యవహరించేవారని, అంత్య దశలో సోమసుందర్ గారిని పిలిచి **"అమ్మను (వీణను) తీసుకు రా రా, జాగ్రత్త, ఎత్తేస్తావు సుమా"** అన్నారట. కళాకారుడు కళతో అట్టి తాదాత్మ్యాన్ని పొందగలిగి, కళారాధనే జీవన పర్యంతం శ్వాసగా భావించినపుడే చరిత్రలో స్థానం పొందగలరన్నారు.

ఈ సందర్భంలో మనం శ్రీ సోమసుందర్ సంగీత ప్రియత్వాన్ని, ఆ కళపై వారి పరిశోధనను కొంత చర్చించుకోవాలి. బాల్యంలో వీరు **కపిలవాయి రామనాథశాస్త్రి** గారి గ్రామఫోను పాటలు విని అనుకరించి ఆలపించేవారు. 'గాన కళ' సంగీత పత్రికకు గౌరవ సంపాదకత్వం వహించడమే కాక, వీరు సంగీతంపై వ్రాసిన 50 వ్యాసాలను అందులో ప్రచురించారు. తరువాత ఆ వ్యాసాలు **'హంసధ్వని'** పేరిట వెలువరింపబడి, ఎందరో హిందుస్థానీ, కర్ణాటక సంగీతవేత్తల జీవన విశేషాలను అద్భుతంగా ఆవిష్కరించాయి. అలాగే, వారి భావగీతాలన్నీ **'మనస్సంగీతం'** గా గ్రంథస్థం చేసారు.

**ఉత్తమ కవిత్వమంటే :- ఎవరు రాసినది ఓజస్వంతంగా ఉండి, మననం చేసే కొద్దీ రుచులు కలిగిస్తూ ఉంటుందో - అదే ఉత్తమ కవితంటారు సోమసుందర్.** మొదటి సారిగా చదువుతున్నప్పుడే పేలవంగానో, వెకిలిగానో, అశ్లీలంగానో తోచి, ఆకర్షవంతంగా ఉండని కవిత, పాఠక హృదయంలో స్మృతి రేఖల్ని విస్తరింప చేయలేదని; ఏది చదువరి హృదయంలో, అతని సంస్కారంలో అంతర్భాగం కాలేదో అది శక్తివంతమైన కవిత ఎన్నటికీ కాజాలదని వారి అభిప్రాయం.

కేవలం వైచిత్రితో చమత్కారాన్ని కలిగించే కవిత విషయంలో - అది కలిగించే భావనా తరంగాలూ అల్ప పరిధిలో అంతమవుతాయి. ఉత్తమ భావ మధురమయిన కవిత, చదువరి మనస్సులో స్థిరనివాసం ఏర్పరచుకుంటుందని చెబుతూ; కవితా రచనలో సంవిధానం, భావ పరిమళం లోపిస్తే అది గుణరహిత మవుతుందంటారు. ఒక్కమాటలో, **ఏం చేసినా కవితా మయంగా ఉంటే కవిత్వమే** అన్నది వారి సిద్ధాంతం.



**కవిత్వం - శబ్ద సౌందర్యం :-** కవిత్వంలో పదాల పోహళింపు విషయానికొస్తే - కవి ఫలానా పదాలు వాడాలి, ఫలానా పదాలు వాడకూడదు అనేది చర్చనీయాంశం కాకూడదని; ఆయా సందర్భాన్ని బట్టి అనుభూతిని బట్వాడా చేయడానికి అర్హమైన పదాలుగా కవికి తోచిన వాటిని ఎన్నిక చేసుకుంటూ ఉంటాడనీ; తాను ప్రయోగించే ప్రతి పదాన్నీ కవి సమానమైన ఆదరణతో ప్రయోగిస్తాడంటారు శ్రీ సోమసుందర్.

**కవి - సామాజిక బాధ్యత :-** "ఏ కవి అయినా తాను బ్రతికే కాలానికి ప్రతినిధిగా ఉంటాడు. గతం, భవిష్యత్తుల మధ్య వంతెనలా ఉండాలే గానీ అటో ఇటో పారిపోవడం కవి కర్తవ్యం కాదు. వర్తమానంలోనుంచే ప్రజల్ని మేలుకొల్పాలి. అది మూడు కాలాలకీ అతీతంగా ఉండే కాంతి రేఖ. దానిని ఏ కాలానికీ బంధింపజాలము.

సమాజాన్ని కేవలం రచనల ద్వారానే సముద్ధరించగలమన్నది - దురాశ. అయితే మనలాగ ఆలోచించే కొద్దిమంది మనస్సుల్లో మన రచనలు చిరవాసం కల్పించుకొని వారి ఆలోచనలకీ, ఆశలకీ దీప్తి కలిగిస్తే చాలు. అలాగే, సమాజ రుగ్మతల్ని సామాజికులే పరిష్కరించుకోవాలి. సామాజికులలో కవి భాగస్వామి; ఆ సామాజిక "మహాక్రతువుకు కవి ఋత్విక్కు ఐతే చాలు" ఇవన్నీ **"సాహిత్యంలో సంశయ కల్లోలం"** గ్రంథంలో 3 దశాబ్దాల పూర్వం శ్రీ సోమసుందర్ వ్యక్తం చేసిన అభిప్రాయాలు. "కవి ఎపుడూ తన రచనలో సమాజాన్ని విడిచి పెట్టరాదు. అలా చేస్తే సమాజం కూడా ఆ కవిని విస్మరిస్తుంది" అన్నది నేటికీ ప్రతి రచయితకూ సోమసుందర్ పదే పదే సూచించే సూత్రం.

***

వారి 14వ యేట రచనా వ్యాసంగాన్ని ప్రారంభించిన తర్వాత రాయకుండా గడిపిన క్షణాలన్నిటినీ విషఘడియలుగా భావించే ఈ శతాధిక గ్రంథకర్త సాహితీ క్షేత్రాన, వారి కృషీవలత్వం మరింతగా నిరంతరాయంగా సాగించాలని ఆశిద్దాం.

- **'కలలు-కన్నీళ్ళు' - 2005లో; 'పూలు-ముళ్ళు' - 2013లో ప్రచురితమయ్యాయి.**
- **క్రీడాభిరామం కావ్యకర్త 'వినుకొండ వల్లభరాయుడు" అని మానవల్లి రామకృష్ణ కవి, చిలుకూరి పాపయ్యశాస్త్రి వంటివారు; అది శ్రీనాథుని కృతిగా వేటూరి ప్రభాకర శాస్త్రి వంటివారు ప్రతిపాదించారు. ఇది ప్రతాపరుద్రుని ఉంపుడుగత్తె "మాచల్దేవి' గౌరవార్థం రచింపబడిన వీధి నాటకం.**
- **'సాహిత్యంలో సంశయ కల్లోలం' శ్రీ సోమసుందర్ షష్టిపూర్తి సందర్భంగా ప్రచురింపబడింది.**

*** పై సమీక్ష సెప్టెంబర్ - 2014 "సాహిత్య ప్రస్థానం"లో ప్రచురితం.**

# 4 సాంస్కృతిక విధ్వంసంపై ఎక్కుపెట్టిన కవితాస్త్రం

## - అద్దేపల్లి దీర్ఘకవిత "తెరలు"

అంతర్లోకాల మథనం, సామాజిక అవగాహన రెండూ సమపాళ్ళలో కలిపి వాస్తవికత, అనుసృజనల సమ్మిళిత ముద్ర వెయ్యగలవాడే అసలైన కవి అని ఉద్ఘాటించే డా. అద్దేపల్లి పాశ్చాత్య దేశాల వ్యాపారతృష్ణకి దేశం బలైపోతున్నపుడు, ఉన్నత సంస్కారంగల ఈ జాతి సంస్కృతిని, ఆర్థిక దోపిడీ వేళ్ళతో సహా పీకివేస్తున్నపుడు, కళ్ళముందు జరుగుతున్న విషాదాన్ని తన కలంతో సమాజానికి కనిపింపచేసి, పఠిత హృదయాలను కంపింపజేసేందుకు, తద్వారా అత్యున్నత శ్రేణి కవిగా తన ధర్మాన్ని నిర్వర్తించేందుకు చేసిన ప్రయత్నమే ఈ **"తెరలు"**.

**"మనుషులెలాగో, మనిషి అంచుల్ని సాగదీసిన దేశాలు అంతే"** అంటూ మనిషిలోనూ మనుషుల సమూహమైన దేశంలోనూ నాగరికత పేరిట పేరుకుపోతున్న మాలిన్యాన్ని ఎండగట్టి, నైతికత్వాన్ని మరుగుపరిచే పొరలను, మెల్లమెల్లగా తొలగించేవే ఈ తెరలు.

***

మొన్న, మబ్బులు కమ్ముకుని ఉన్న కొండలతో తాదాత్మ్యం పొందిన అద్దేపల్లి నిన్న పడమటి గాలి ఆ మబ్బుల్ని ఊదేసి కొండల్ని నగ్నంగా నిలబెట్టినపుడు, ఇవ్వాళ కొండల అంచుల మీదకి మద్దిచెట్ల వేళ్ళు పాకుతున్న దృశ్యాన్ని చూసి చలించి; రేపు ఆ చెట్ల కొమ్మలు కొండల్ని పట్టి అతలాకుతలం చేస్తాయనే భావనతో వేదన పొంది **"చెప్పరాని వేగంతో కాలం పొరలు ఒకదానిపై ఒకటి పొర్లి ప్రకృతికి మానభంగం చేసే ఒక బీభత్స కలుషిత సంధ్యా సందర్భాన్ని"** కవిత్వీకరిస్తారు.

***

ఒక పదం పలికినపుడు ప్రజలకు ఎలాంటి భావన గుర్తుకొస్తుందో దాని ఆధారంగా ఆ సంస్కృతిలో ఆ పదానికి ఉన్న ఔన్నత్యాన్ని అంచనా వేయవచ్చు. ఈ



దేశంలో, దాంపత్య జీవనంలో పవిత్ర అంతర్భాగమైన "శృంగారం" నేడు విదేశీ ప్రభావంతో 'సెక్స్'గా రూపాంతరం చెందిన దుస్సమయాన ఈ రెంటికీ మధ్య వ్యత్యాసాన్ని తీవ్ర పదజాలంతో వివరిస్తూ – శృంగారం అంటే **"చిన్న అందం మెలిపెట్టిన దగ్గర నుంచి అపూర్వ అనుభవాల దాకా దీని పరిధి మనస్సులో ఆకాశమై ముడుచుకుంటుంది. బజారుపాలైన సెక్సుకి అనుభూతి విలువపోయి మార్కెట్ విలువ మిగిలిపోతుంది"** అంటూ **"పదం సంస్కృతికి ప్రతిబింబం"** అని సూత్రీకరిస్తారు.

స్త్రీ, పురుషుల మధ్య ప్రాకృతికమైన అవసరాన్ని అందమైన బంధంగా రూపకల్పన చేసింది మన సంస్కృతి.

**"కోరికకీ అవసరానికీ మధ్య ఉన్న బాటనిండా**
**అనుబంధాల చెట్లు నాటి**
**ప్రేమపూలు పూయించి**
**రెండు హృదయాల్ని ముడివేసి,**
**ఈ తోటలోని మట్టి ఊపిరి –**
**అవసరానికీ కోరికకీ**
**పాణి గ్రహణం చేయించింది"** అయితే,

**"విరుచుకుపడే**
**పడమటి తోటల్లోని మట్టి**
**ఈ చెట్ల వేళ్ళన్నిటిలో శ్వాసను నిర్జీవం చేస్తుంది.**
**అవసరం కోరికగా**
**కోరిక అవసరంగా**
**రెంటికీ విడాకులిప్పించి**
**మనస్సుని ముక్కలు చేసి**
**ఆకాశానికి విసిరేసి**
**స్త్రీ శరీరాన్ని మార్కెట్‌లో పెడుతుంది"** అంటూ స్త్రీని భోగ వస్తువుగా చూసే సాంస్కృతిక నీచత్వం రాజ్యమేలుతోందని గుర్తు చేస్తారు. "పడమటి తోటల్లోని మట్టి" అనే ప్రయోగం ధ్వనిమంతంగా, కవి ఆలోచనలకు ప్రతీకగా నిలుస్తుంది.

***

తనదైన ఔచిత్యాన్ని, ఘనతను, విస్తృతిని కలిగి ఉన్న ప్రతీరసం నేడు తన అస్తిత్వాన్ని కోల్పోతున్నదని; రసం వ్యాపార కళారూపంగా మారి "ప్రతీ కళా సెక్సుతో తిరగమోత పెట్టబడుతోంది" అంటారు. నవరసాలే కాదు కళలు కూడా సంకరమై తమదైన సహజత్వాన్ని కోల్పోయి, వాటి లక్ష్యాన్ని అవి నెరవేర్చలేకున్నాయన్నారు.

**"ఎప్పుడు సంగీతం**
**దృశ్యాన్ని కౌగిలించుకుందో**
**అప్పుడే శరీరపు అంగట్లో**
**ఆత్మనమ్ముకునే అందంగా మారిపోయింది;**
**ఎప్పుడు దృశ్యం**
**సంగీతాన్ని ముద్దులాడిందో**
**అప్పుడే శరీరపు రేఖలతో ఉరివేసుకుని**
**ఊపిరి కోల్పోయింది"** అంటూ ప్రతి కళాభివ్యక్తి నేడు **కల్మషపూరిత మౌతోందంటారు.**

సాహిత్యకారులూ తమ ఔన్నత్యాన్ని విస్మరించి ప్రపంచానికి తాము అందజేయవలసిన దిశానిర్దేశాన్ని విస్మరిస్తున్నారు. **"కలాలు పట్టిన చేతులన్నీ మన్మథుడు ఒలికించిన సిరాలో వేళ్ళు ముంచుకున్నై".** సందర్భమేదైనా ప్రేక్షకుడిలో **'ఆ'** భావనను రెచ్చగొట్టడమే ధ్యేయంగా నేటి తెరలు పనిచేస్తున్నాయని, **"ఆడది ఏడుస్తుంటే కెమేరా శరీరమంతా తడుముతుంది; ఆడది మగవాడి దౌర్జన్య కథ చెప్తుంటే కలం కామ సూత్రంతో కన్నీటిని కుదుతుంది"** అంటూ ఈ వ్యామోహంలో పడి **"కథలోంచి అడుగడుగునా బయటకు వచ్చి జీవితానికి బయట పాతుకుపోవడమే ఈనాటి వెండి తెరల బంగారు సంపాదన"** అని విమర్శిస్తారు. **"యథాస్మై రోచతే విశ్వం"** ఆనాడు కవికి ఆదర్శం కావచ్చు. కానీ ఈనాడు ప్రజలకు దిశానిర్దేశం చేసే బాధ్యతను తెరపుచ్చేసుకుందంటారు. "నిన్న సిద్ధాంతాన్ని పరమ లక్ష్యంగా పెట్టుకుని కవిత్వాన్ని రాసిన కవి ఈ రోజు తన ప్రతిభను టి.విలకి, సినిమాలకి, మురికి ఛానళ్ళకి తాకట్టుపెట్టి, సిద్ధాంతాన్ని కోల్పోయి, బానిసత్వంలో అన్ని వక్రతలకీ కేంద్ర స్థానం అయ్యాడు. పాశ్చాత్యవాదాల పట్ల వ్యామోహం కవిని తనను తాను కోల్పోయే లోకాలకి



విసిరేస్తోంది" అని ప్రతి సందర్భంలో పదే పదే ఉద్ఘాటించే అద్దేపల్లి తన భావజాల విశ్వరూపాన్ని ఈ తెరలపై బాహాటంగా ఆవిష్కరించారు.

***

ఈనాడు ప్రపంచమంతటినీ మనిషి తన కళ్ళతో కాక కెమెరాతో మాత్రమే చూస్తున్నాడు. ఆసక్తికర విషయ భాగాన్ని ఎంతయినా జూమ్ చేసి ఆనందించే వెర్రితనంలో సహజత్వానికి సుదూరంగా బ్రతికేస్తున్నాడు. **"ఈనాడు కెమెరా విప్పుకున్న కన్ను ప్రపంచపు గుడ్డితనమంత పెద్దది"** అంటారు అద్దేపల్లి. **"ఏ అవయవపు ఏ చిరు కదలికని సాగదీస్తే మంచి సన్నివేశాలన్నీ శృంగారపు చితిమంటల్లోకి దూకి ఆత్మహత్య చేసుకుంటాయో"** ఆ కెమెరాకి తెలుసంటారు. అందమైన ప్రాకృతిక దృశ్యాలతో కంటిపొరలన్నిటినీ ఆహ్లాదపరిచాక అసభ్య సన్నివేశాలతో వాటికి మాలిన్యాన్ని పూయడాన్ని **"ప్రకృతి దృశ్యాల్తో కళ్ళని అలికి ముగ్గులు పెట్టి బూతు బురదల బూట్ల పాదాలతో తుడుచుకుంటూ పోవడం"**తో పోలుస్తారు. ఏ సన్నివేశమూ ఇందుకు అతీతం కాదంటూ **"కెమెరాకు శవం మీద ఏడ్చే వనిత జఘనాల కోణాలతో ఒక ఉన్నత సాంస్కృతిక దర్పణాన్ని ముక్కముక్కలుగా చితగ్గొట్టడం తెలుసు"** సాంస్కృతిక విధ్వంసమే ధ్యేయంగా **"ఉదాత్తంగా ఎదుగుతున్న రసవృక్షానికి విష ఫలాలు పండించడం తెలుసు"** అంటారు.

నాగరికతకి అసలు కన్నుపోయి కెమేరా కన్ను మొలిచిన తర్వాత 'ఆనందము, ఆందోళన రెండూ పెరిగాయంటూ వీధులు విశాలమైనాయనే భ్రాంతిలో మనం ఉన్నా మలుపు తిరిగే సందులన్నీ మసిపూసుకున్నాయి. ప్రవాహం ముందుకే పోతున్నా, పడవ మాత్రం సుడిగుండంలో సున్నాలు చుడుతోంది' అని హెచ్చరిస్తారు.

***

అనూచానమైన మన భారతీయ సంస్కృతి, జీవనంలో ప్రతి అంశానికి ఒక నిర్దిష్ట స్థానాన్ని నిర్దేశించింది. గ్రహాలన్నీ నిర్దిష్ట కక్ష్యలలో భ్రమించినపుడే విశ్వ గమనం సాఫీగా సాగిపోతుంది. అలాగే నిర్దేశిత స్థానాలలో నియంత్రణ చేయగలిగిన నాడే శారీరక ఉద్వేగాలు, తద్వారా సామాజిక ఆరోగ్యం ప్రమాదరహితంగా ఉంటాయి.

**"మన్మథుణ్ణి**
**కాలి అందెలుగా చేసుకున్న సంస్కృతి**
**పూలబాటల మీద పొందికగా నడచిపోతుంది.**
**ఒంటి మీద కవచంగా తొడుక్కున్న సంస్కృతి**
**ముళ్ళ మీద చీర లాక్కుంటూ**
**చీరంతా రక్తసిక్తం చేసుకుంటుంది**
**ఒకటి**
**నీ సంప్రదాయాన్ని గుర్తుకు తెస్తుంది**
**మరోటి**
**నీ మూలాధార కోరికల అనాగరికతలోకి**
**నిన్ను లాక్కుపోతుంది.**
**మొదటిది నీ జాతికవసరం.**

**రెండోది నీ దాహానికవసరం"** అంటూ నీ జాతికి వారసత్వాన్ని అందించేందుకు చేయవలసిన పనిని నీ దాహోపశమనం కోసం చెయ్యడం అనాగరికతలోకి పయనించడమేనంటారు.

ఇదే భావనతో మరోచోట
**"లైంగికతను నువ్వు నుదిటి మీద దీపంలా చుట్టుకుంటే**
**గనుల నిండా దోవ చూపే కన్నవుతుంది.**
**దాన్ని కాళ్ళ కింద ఊబిగా చేసుకుంటే**
**ముందడుగుల్లోకి కూరుకుపోయే నడకవుతుంది.**
**సెక్సంటే తెలిసిన వాడెవ్వడూ**
**దాని దుమ్ము కాళ్ళతో బజార్లో తన్నుకుంటూపోడు,**
**సెక్సంటే గౌరవమున్న వాడెవ్వడూ**
**దాన్ని అంగడి సరుకుగా మార్చడానికి ఒప్పుకోడు"** అంటారు.

***



ఈనాటి సంస్కృతి బాల్య, యౌవన, వార్ధక్య దశలు మూడింటిలో యౌవనం మాత్రమే మిగుల్చుకుంది. శిశువు నుండీ యౌవనాన్ని పిండి, ముసలి నుంచీ యౌవనాన్ని పీకి రెండు శూన్యాల్ని రెండు కళ్ళుగా చేసుకున్న ఈనాటి సంస్కృతికి **"ప్రాకృతికానుభూతుల బాల్యం లేదు. పరిణతానుభూతుల వార్ధక్యం లేదు. యౌవనం యౌవనాన్ని ఆబగా పోగుచేసుకుంటూ యౌవనాన్ని కోల్పోయి ముసలి గొంతుతో ఏడుస్తోంది"** అంటూ మనం విస్మరిస్తున్న ఓ అంధకార కోణాన్ని దీప్తిమంతం చేస్తారు.

***

వికాసం పేరిట విదేశీ సహకారాన్ని అర్థిస్తున్నపుడు కేవలం మనం కోరిన సహాయాలే కాక సంస్కృతిని విచ్ఛిన్నం చేసే అంశాలూ బట్వాడా కాబడతాయి.

**"డబ్బు కోసం అడిగిన బిచ్చం**
**పాత్రలోకి అహంకారాన్ని కూడా జారవిడుస్తుంది.**
**పుచ్చుకున్న వాడి కళ్ళలోని కాంతిలో**
**మరణించిన కొన్ని కిరణాలు**
**ఇచ్చేవాడి చూపులకి**
**తమ జీవాల్ని సమర్పించుకుంటై"**
**"తీసుకున్న దేశంలోకి**
**డబ్బు కాల్వల్ని తవ్వినపుడు**
**కెరటాల మీదుగా**
**తమ సంస్కృతిని కూడా సరఫరా చేస్తై;**
**ఇస్తున్న వాడి సంస్కృతి**
**తీసుకుంటున్నవాడి సంస్కృతిలోకి**
**బ్లాక్ సుగరులా కరిగిపోతుంది"** అంటూ ఈ దేశ దిశ, దశలను పాశ్చాత్య దేశాల సామ్రాజ్యవాదం నిర్దేశించడం మొదలుపెట్టిన మరుక్షణం మౌలిక సంస్కృతీ పతనం ప్రారంభమైనదంటూ, వారితో మనం ఏకీభావన పొందేటట్లు చేస్తారు.

***

ఈ దీర్ఘకవితలో కేవలం సమస్య, దాని మూలాలు, తీవ్రతతో మాత్రమే విడిచిపెట్టకుండా మరలా సాంస్కృతిక పునర్వైభవాన్ని దర్శిస్తారు డా. అద్దేపల్లి. **"నిండైన ప్రకృతిని అణువణువునా నింపుకుని ఉరుకులు పరుగులుగా వచ్చి కాస్త ఊపిరి పీల్చుకోడానికి ఇసుకంతా ఒక చోట మేటవేస్తే, కొట్టుకొచ్చిన పిచ్చి మొక్కలన్నీ మేటమీద ఊపిరిపోతుకున్నై. ఎదిగి మేటంతనీ ఆక్రమించినై. ఈ మేటంతా తమ సామ్రాజ్యమని, నీటిలోని ప్రతిబింబం తమ శాశ్వత ఆధిపత్య పతాకమని ఊగిసలాడిపోయినై. ద్రవీభవించిన కాలం గుండె గోదావరి ప్రవహిస్తూ, ప్రవహిస్తూ, ప్రవహిస్తూ మేటంతనీ కరిగించివేసింది; ఇసుక కొట్టుకుపోయింది; మొక్కలు కొట్టుకు పోయినై; ప్రవాహంలో కలిసిన ఏడుపు కనిపించకుండా కొట్టుకుపోయింది. గోదావరిలో ఎరుపు జీరల సూర్యనేత్రం ప్రతిఫలించింది; దేశం నిండా జీవధార ఒళ్ళు విరుచుకుంది"** అనే స్ఫూర్తిమంతమైన ముగింపుతో, పిచ్చి మొక్కల ఆధిపత్య పతాకం ఈ దేశ సాంస్కృతిక జీవధారలో కొట్టుకుపోతుందనే ఆకాంక్షను వెలిబుచ్చారు. కవి వాక్యం వ్యర్థం కాదు. తథాస్తు.

- **శ్రీరామతీర్థ ఆంగ్లానువాదంతో డా॥ అద్దేపల్లి దీర్ఘ కవిత "తెరలు" 2010లో తొలి ముద్రణ పొందింది.**
- **పై సమీక్ష 15 సెప్టెంబర్, 2014న ఆంధ్రప్రభ "సాహితీ గవాక్షం"లో ప్రచురితమైంది.**



# 5 కలలో... పెదవులు పలికే పదాలు...

బాహ్య ప్రపంచాన్ని పరికించాలనుకున్నపుడు సాధారణనేత్రం దృక్ క్షేత్రంలోని అంశాలనే దర్శింపజేయలుగుతుంది. అయితే, విశాలసృష్టినంతా తన భావనతో హృదయస్థం చేసుకున్న కవి మనోనేత్రంతో చూడగల విషయాల పరిధిని నిర్దేశించగలమా? ఇలా, మనో నేత్రంతో దర్శించిన విషయాలను, మదిలో ఉరకలెత్తే భావాలను 'మెలకువ వచ్చిన తరువాత కూడా గుర్తుండిపోయే కలలోని సంభాషణల్లాంటి' కవితలుగా మలిచిన సంపుటి **"కలల పెదవుల నవ్వుల్లోకి".**

అందుకే, హృదయాంతరాళంలో నిరంతర ప్రకాశాన్ని నింపుకున్న శ్రీ సూర్యభాస్కర్ **"చీకట్లో కళ్ళు మూసుకుంటే**
**మనసంతా కన్నై**
**ఇంకెంత బాగా చూడగలమో!"** అంటారు – **'చీకటే లేకపోతే'** కవితలో. ఈ అంతర్వీక్షణమే, కవిత్వజనన కారకమవుతుంది అని 'కవితా స్వరాలు' కవితలో తెలియజేస్తారు.

కవిత రూపుదిద్దుకోవాలంటే **"అనుభవాల రెక్కల కింద ఆలోచనల పచ్చని స్పర్శలో అనుభూతుల్ని పొదగాల"**ని ఈ క్రమంలో **"మథనం, గ్రథనం, అంతః ఘర్షణ చైతన్యం"** – ఇన్ని దశలు దాటి **"మెదడు గుడ్డు పొదగబడ్డాక స్తబ్ధ కర్పరాన్ని పొడుచుకొచ్చే శబ్ద చివురుల కువకువలే – అక్షరాల రవరవల"**ని కవితా నిర్మాణ క్రియను ఒక శాస్త్రీయమైన సూత్రంలా ఉత్పాదిస్తారు.

అయితే, హృదయ క్షేత్రంలో జనించిన భావజాలం అక్షరాల రవరవలుగా రూపాంతరం చెందాలంటే –

**"జీవితాగాధాలను**
**అనుభవాల తెడ్లతో ఈదులాడుతూ**

**అనుభూతుల తెరచాపలనెత్తి**
**మనసు పడవపై విహరించే**
**రహస్యపు దారులలో –**
**వలయ వలయ వలయాల**
**శాఖా చంక్రమణమై**
**భావాల సుడిగుళ్ళు**
**తిరిగి తిరిగి తిరిగీ –**
**ఒక అభావంలోకి పయనించాల"**ని, అపుడే భావాతీత ధ్యానం రూపించిన కవితలుద్భవిస్తాయనే కార్యకారణ సంబంధాన్ని విశదపరుస్తారు.

'పాపాయి'ని వర్ణిస్తూ...
**"నిద్రపోకుండా పెద్దారిందాలా, రాత్రంతా మేలుకుని**
**చేతుల్లోంచి మెత్తగా చేతుల్లోకి జారుతూ –**
**'మొఖ'మల్ నవ్వుల కాంతులతో**
**కళ్యాణ మండపాన్ని వెలిగించింది"** అంటూ వ్రాసిన 'చాందినీ' కవితలో ప్రతీ పదం పసితనపు సౌకుమార్యాన్ని పూసుకుంది. ముఖ్యంగా 'పెద్దారిందాలా" పద ప్రయోగం ఈ వాక్యానికి "ఊయేల దిగని భాగ్యోన్నతుండు; తన యింటి క్రొత్త పెత్తనపుదారు" అని కవికోకిల జాషువా చేసిన శిశు వర్ణనను గుర్తు చేస్తుంది.

**నల్లబారిన అలసటని, నిశ్శబ్ద నిశ్చైతన్య స్తబ్ధతని బహుసున్నితంగా తుడిచేసే తువ్వాలును – 'మరుసటి జీవనోత్సవాన్ని నిరుపమానంగా వెలిగించే'** ప్రకృతితో అనుసంధానం చేసినపుడు;

టప... టపా రాలే చినుకులను **"సేద గూర్చే హాయి పలకరింపుతో" ప్రకృతి రాసిన 'టపా'**గా అభివర్ణించినపుడు;

నల్లని ఆకాశంలో మెరుపు తీగలా "జుట్టులో కనిపించే తెల్ల వెంట్రుకను" పోల్చినపుడు;

**"అద్దం ముడుతలు పడింది, గాజు తెరల్లోంచీ చూపులు మసక బారాయి,**



**నాలుక చచ్చిపోయింది"** అంటూ ముదిమి వయస్సు చిహ్నాలను శరీరానికి కాక వాటిని వ్యక్తపరిచే అంశాలకు ఆపాదించినపుడు;

సాగనంపడానికి వచ్చిన స్నేహితుణ్ణి, అతని సాహచర్యాన్నీ ప్రయాణమంతా తలుచుకుంటూ ఆ తలపులకు అక్షర రూపం ఇచ్చిన 'వీడ్కోలు' కవితలో **'ముందుకే వెళ్తున్నా వెనకటి నెమరు వేత'** – అన్నపుడూ;

**"అందరికీ విందులయ్యాయి – మా పాపాయి బోసినవ్వులు"** అని పాపపై మురిపెమంతా మాటలుగా మార్చగలిగినపుడు... ఇలా ఎన్నెన్నో సందర్భాలలో తన రమణీయ భావుకతతో పాఠకులను సమ్మోహితం చేస్తారు శ్రీ సూర్యభాస్కర్.

ఇక, పసి(డి) గురుతుల వైపు మనలను పరుగులు తీయిస్తూ "రహస్య స్థావరాలు" కవితలో
**"బుల్లి మొహాలకి**
**లేత అరటాకులు చుట్టుకుంటే**
**ప్రపంచం మాయమైపోతుంది.**
**బండకి జట్టు మొలుచుకొస్తుంది.**
**పెట్టని టివీ పళ్ళికిలిస్తుంది వెనగ్గా!"** – అంటూ మన జీవిత ఆల్బం మొదటి పేజీలను మరోసారి స్మృతిపథంలో మెరిసేలా చేస్తారు.

మనకు అందగా నిలిచే నీటి ప్రాముఖ్యాన్ని **"బ్రతుకు నాగరికత"**లో
**"చెమట నీటస్నానమాడిన విత్తు**
**చిగురై నవ్వుతుంది.**
**నీరుంటేనే –**
**మనుషుల జత... మమతల కత**
**నీరంటేనే**
**మనసుల పెనవేత**
**నీరే బ్రతుకు నాగరికత"** అని శ్లాఘించిన శ్రీ సూర్యభాస్కర్,
**"తడి తడిగా ఆలోచించే"** అని మరో కవితలో

**మనసుల్ని తడిచేసేదీ**

**మాలిన్యాల్ని తుడిచేసేదీ**

**అసూయ, ద్వేషాల పొరల్ని మడిచేసేదీ**

**మమతల మడి చేసేదీ – ఒక్క నీరే** అంటూ నీటి బహుముఖీనతను సరళంగా, స్ఫుటంగా వ్యక్తీకరిస్తారు.

'రెండు గెలుపుల మధ్య' కవితలో

**"చిట్లించీ, గుక్కపట్టి, గిచ్చుకునీ, నొచ్చుకునీ**

**కాంతి ధూళిలో ఈది ఆనందించాను..**

**బాధను అనుభూతించి పలవరించాను..**

**ఆ క్షణం నాకు తెలీదు, అది గెలుపని!"**

ఆ తరువాత, పాకడం, నడవడం, నిలదొక్కుకోవడం, .. ఇవన్నీ గెలుపులే" అంటూ జీవించడమంటే – జీవన గమనంలో అన్ని దశలలోనూ గెలుపును శోధించే ప్రయత్నమే అంటారు.

**"ప్రిఫిక్సులు కోల్పోతూ"** కవితలో ఒకనాటి **చిర–స్మరణీయమైన సంస్కృతి నేడు ప్రిఫిక్స్ కోల్పోయినదని,** మనం సహజాతాలను సైతం మరిచిపోతుంటే సంస్కృతి **'స్మరణీయ దశను దాటి రమణీయంగానే మిగిలిపోయి అటుదిటుదౌతూ మరణీయ మౌతోంద'**ని వాపోతారు.

ఇక, వంద కవితా సుమాలను గ్రుచ్చిన ఈ మాలికలో అంతస్సూత్రం – జీవన పార్శ్వాల అపూర్వ ఆవిష్కరణమే.

**"దెబ్బతిన్న శిల గడపగా మారి**

**అందరి పాదాలతోనూ తొక్కబడితే...**

**దెబ్బలన్నీ ఓర్చిన శిల**

**పూజింపబడుతోన్న పాదాలైంది"** అంటూ **'శిలల వనం'** కవితలో సహన గుణమే పూజనీయతను కలుగజేస్తుందని ప్రతీకాత్మకంగా చెబుతారు.



ఇలాంటి భావనతోనే 'మనిషినే ఆభరణంగా' కవితలో

**"బంగారాన్ని సాగ్గొట్టే నైపుణ్యముంటే**

**ఎంతైనా సాగుతుంది...**

**సాగే కొద్దీ మెరుస్తుంది**

**కాలమూనూ!**

**అనంతమై సాగుతూ**

**సాగే కొద్దీ చరిత్రవుతుంది"** అంటారు.

మరోచోట,

**"సెకను గడవడానికి**

**సెకను కూడా పట్టని –**

**దానిని పట్టుకోవడమే జీవితోత్సవం"** అని నిర్వచిస్తారు.

కొన్ని "అయితే", "కాకపోతే", "మరియూ", "కానీ"లు వెరసి ఒక 'అవును' పది 'కాదు'ల కలయికగా జీవితాన్ని వర్ణిస్తూ అభిలాషకు ప్రతికూలమైన పర్యవసానాలే అధికంగా ఎదురవుతాయని నర్మగర్భంగా పేర్కొన్నారు.

**"బ్రతకటమంటే – ఊపిరి తీసుకుంటూనే**

**అందులోని తడిని ఆస్వాదించాలి;**

**ప్రకృతిలోని జీవాసాంత్వన**

**జీవన వ్యాపారం కావాలి;**

**జీవన ఉత్సవంగా వెలగాలి.**

**పాత జీవితమే కొత్తగా జీవించడం నేర్చుకోవాలి**

**రంగులు, రాగాలు... కలలూ, కల్పనలు...**

**మార్చుకుంటూ**

**కూర్చుకుంటూ**

**పేర్చుకుంటూ**

**చేర్చుకుంటూ..'** అంటూ జీవించటాన్ని ఒక యాదృచ్ఛిక సన్నివేశంగా కాక నిరంతర ఆస్వాదనగా అభివర్ణిస్తారు.

మరోచోట, క్రిమి, కీటకాదులకు; పక్షులు, సరీసృపాలు, మానవులు.. ఇలా ఏ జీవికైనా జీవనపథాలు వేరయినా క్రియ ఒక్కటే – జీవించడం. అంటూ ఆ

క్రియలో సరళిని, వినిపించే రవళిని **'జీవన సంబారం'**గా వినిపిస్తారు.

**"అమ్మ నీకెందుకు నచ్చింది?"** అని అమాంతంగా, అమాయికంగా అడిగిన పాపాయికి **'అమ్మ నీకు అమ్మయినందుకు"** అని చెప్పి తప్పించుకున్న నేర్పరితనం శ్రీ మాకినీడిది. మరే విధంగా చెప్పినా ఇద్దరి దగ్గరా మంచి మార్కులు పొందడం కష్టం కదా!..

అలాగే, "లోకానికి తెలీకూడదనుకున్నపుడు కళ్ళు – మూతలు పడతాయి" అని ఒక అందమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించి మనకు నమ్మకం కలగటం కోసం "ముద్దెట్టు కోవటం పిల్లి పాలు తాగటమంత సుఖం" అని చక్కని ఉదాహరణతో మనతో ఔననిపిస్తారు.

చివరిగా,

**"ప్రతి జీవితమూ కాలంతోనే కొలవబడుతుంది కానీ –**
**కాలం ప్రతి జీవితంతోనూ కొలవబడదు;**
**కాలాన్ని కొలిచే జీవితాలే అవుతాయి –**
**మానవ జీవన గమనానికి మైలు రాళ్ళు!**
**చరిత్రకు పునాది రాళ్ళు!!"** అని **'కాలాన్ని కొలిచే జీవితాలు'** కవితలో మాకినీడి పేర్కొన్నట్లు సారస్వతమూ శాశ్వతత్వాన్ని పొందాలంటే ప్రతీ దశలోనూ కాలాన్ని కొలిచేందుకు 'మైలు రాళ్ళు'గా నిలవగల సాహిత్య సృజన జరగాలి.

మూడు దశాబ్దాలకాలంగా అర్ధ శతాధిక గ్రంథాల నిర్మాణంలో మాకినీడి తన నిరంతరాయమైన కృషితో సాహిత్యాభిమానుల మనసులను గెలుచుకోవడంలోనే కాక, తన జీవితాన్ని కాలాన్ని కొలిచేదిగా మలుచుకొనే ప్రయత్నంలోనూ సఫలీకృతుల య్యారనడంలో అతిశయోక్తి లేదు.

ఈ ఆదర్శ సాహితీమూర్తి కవితా క్షేత్రాన మరింత సతత హరిత (Ever Green) కీర్తితో వెలుగొందాలని కోరుకుందాం.

**✻ మే & జూన్, 2014 'మల్లె పందిరి' ప్రత్యేక సంచికలో ప్రచురితం.**
**✻ 13, జూలై, 2014న శ్రీ మాకినీడి సూర్యభాస్కర్ 'వ్యాస రజతోత్సవ సభ'లో వారి కవితాసంపుటి "కలల పెదాల నవ్వుల్లోకి" పై చేసిన ప్రసంగం.**



# 6 గోవింద, మాధవ, గోపాలయనుచు....

ఒక సాహితీ సృజన జరిగినపుడు అందులో తరచి చూడవలసిన ప్రధానాంశాలు రెండు అవి, రచయితను నడిపించిన ప్రేరణ, రచన ద్వారా వారు చేరదలచిన లక్ష్యం.

**'లీలాశుక'** బిరుదు వహించిన **'బిల్వ మంగళుని' 'గోవింద దామోదర మాధవ స్తోత్రాని'కి శ్రీ గొట్టుముక్కుల వేంకట సత్య నరసింహ శాస్త్రి** గారి అనువాదమైన **"మధుర మాధవం"** అనే ఈ గ్రంథాన్ని చదివినపుడు మొదటి నాలుగు మాటలలోనే వారి వెనుక ప్రేరణ, ముందున్న లక్ష్యము – రెండూ అవగతమవుతాయి.

'అంతరంగం' అనే ముందు మాటలో – వారి బాల్యంలో కార్తీకమాసపు తెల్లవారుఝామున ఇంటిల్లిపాదీ నదీ స్నానాలకు వెళ్ళటం; పూజాదికాలు ముగిసిన తరువాత పెద్దవారు పనులు చేసుకుంటూ ఉంటే పిల్లలు మరలా నిద్రపోవటం; నిద్రా, మెలకువ కాని ఆ మగతలో చెవికి ఇంపుగానూ, మనస్సుకి ఆహ్లాదకరంగానూ వ్యక్తావ్యక్తంగా వినిపంచే పాటలు, కీర్తనలు పసి హృదయంలో ఆనాడే ముద్ర వేయటం; ఆ పాటలన్నిటిలో 'కృష్ణ కర్ణామృతం' శ్లోకాలు వడపప్పులో కలిపిన పంచదార పలుకుల్లా ప్రత్యేకతను సంతరించుకోవటం.... వీటన్నిటినీ జ్ఞప్తికి తెచ్చుకుంటారు. వీటి ప్రభావమే శ్రీ శాస్త్రిగారి ఈ కృతికి ఆకృతినిచ్చాయి. అయితే, వీరు ఆ వడపప్పుని విడిచిపెట్టి కేవలం పంచదార మాధుర్యాన్నే 'మధుర మాధవం' పేరిట మనకు అందజేసారు.

ఇక లక్ష్యం విషయానికి వస్తే 'వినుతి'లో **"మాధవు పదపద్మ మకరంద ఝరిని / మధుపంబునై గ్రోలి మరతు సర్వమ్ము"** అంటూ ఈ ఐహిక అంశాలన్నీ విడిచి సర్వము మరువగలిగే తాదాత్మ్యం పొందాలనేది వారి లక్ష్యంగా కనిపిస్తుంది.

అనువాదాన్ని సమీక్షిస్తున్నపుడు మూలాన్ని మించి రచయిత చేసిన విన్యాసాలను పరిశీలించాల్సి ఉంటుంది. అటువంటి వాటిలో గ్రంథమంతా ప్రముఖంగా చోటుచేసుకున్నది "గోవింద! మాధవ! గోపాల! యనుచు" అనే మకుటం. ఎందుకు ఇలా రాసారు? ఇందులో విశిష్టత ఏమిటి? అనే ఆలోచన ముందు అసలు ఇలా ఎవరన్నారు? అన్నది చూద్దాం.

కౌసల్య అన్నదిట – **"వనముల కేగెడు వరపుత్రుదలచి / వనజాక్షి కౌలస్య వాపోవదొడగె / హారామ ! హారామ! హారామ! యనుచు / గోవింద! మాధవ! గోపాల! యనుచు"**

తరువాత లంకలో రాక్షసుల చెరలో ఉన్న వైదేహి పిలిచిందిట. **'రావయ్య! రామయ్య! రవికులోద్ధార!** అని. మరొక పద్యంలో సీతాదేవి మరోవిధంగా స్మరిస్తోందిట. **"నా పాలి దైవమా / నా ప్రాణకాంత! / రఘునందనా! పాహి! రాజీవ నేత్ర / గోవింద! మాధవ! గోపాల! యనుచు"** అని.

అంతేనా! ద్రౌపది "దుశ్శాసనుడు తన పట్ల అనుచితంగా ప్రవర్తిస్తున్నపుడు సభలోని పెద్దలెవ్వరూ వారించనపుడు ఆ ఆర్తత్రాణ పరాయణుని ఆర్తితో" ఒకసారి; "అరణ్యవాస సమయంలో ద్వైతవనంలో ధౌమ్యుని ఉపదేశం వలన సూర్య ఉపాసనతో ధర్మరాజు అక్షయపాత్రను పొందినపుడు దుర్యోధనుని ప్రేరణతో మహా తపశ్శాలి, శాపాయుధుడు అయిన దుర్వాస మహర్షి మధ్యాహ్నం దాటిపోయాక అపరిమిత శిష్య బృందముతో భిక్షకు రావటం – వారిని స్నానానికి పంపి దిక్కు తోచని స్థితిలో ఆ సర్వాంతర్యామిని శరణువేడుతూ" మరియొకసారి పిలిచిందిట. ఈ సందర్భములో "భక్తుల అవమానాన్ని భగవంతుడు సహించడు" అంటూ రచయిత అద్భుతమైన ప్రతిపాదన చేస్తారు.

అలాగే జైమిని భారతంలోను, పద్మపురాణంలోను చెప్పబడిన హంసధ్వజుడు, సుధన్వుని వృత్తాంతములో తండ్రి విధించిన శిక్షను ఆనందంగా అనుభవిస్తూ మరుగుతున్న నూనెలో మునుగుతూ సుధన్వుడు భక్తిగా పిలిచాడుట.



ఇక ద్వాపరంలో **"చిన్ని రారా, పొన్ని, చిరుత రాచిల్క; కన్న తండ్రి! రార! కమలాక్ష! రార!"** అంటూ గోపాల బాలుర గూడియాడుచూ, ఏపాటి వేళకు ఇల్లు జేరని కృష్ణుని ప్రేమతో పిలిచిందిట – యశోద. "మవ్వపు బన్నీట మజ్జనం బాడి; బువ్వ తిందువు రార! బుజ్జి నా తండ్రీ!" అని కుడువగ మరచిన కృష్ణుని నోరార గారాన ఆహ్వానిస్తోంది.

అదే సమయానికి గోప స్త్రీలు **"మదిలోని యనురాగ మాధుర్య మెగయ/ మధుర రూపుని నెంచి మదిపులకించి / ఆలపించిరి రాగమాలిక లల్లి / గోవింద! మాధవ! గోపాల! యనుచు"** ఆ నవ్వు మోము వాడిని, నవనీతలోలుని పిలుస్తున్నారుట.

తమ బిడ్డలను జోకొడుతూన్న మరికొందరు గోప స్త్రీలు వారు సాక్షాత్తూ శ్రీ కృష్ణునే జోకొడుతున్నట్టు భావన చేస్తూ "కలువ కన్నుల తండ్రి! చలువ జాబిల్లి! / చెలువమ్ము మిగిలిన చెంగల్వ పువ్వ / జో అచ్యుతానంద! జోజో ముకుందా! / గోవింద! మాధవ! గోపాల! యనుచు" అని ఊయలలూపుతున్నారని పదలాలిత్యంతో పరిమళించే పద్యంగా శాస్త్రిగారు మనకు అందిస్తారు.

నిజానికి స్వామి కన్నులను కమలాలతో పోల్చటం ఈ గ్రంథంలో పలుమార్లు కనిపిస్తుంది. అవును, భక్తుడు భగవంతుని నుండి ఆశించేది 'కరుణా కటాక్ష వీక్షణాలే" కదా! అందుకే ఆ కన్నుల వర్ణన లేని ధ్యాన శ్లోకాలు మనకు అరుదుగానే కనిపిస్తాయి. బుధ కౌశికముని శ్రీరామరక్షాస్తోత్రంలో "నవ కమల దళస్పర్ధి నేత్రం" అని శ్రీరాముని వర్ణిస్తారు. అంటే అపుడే వికసించిన కమలములతో స్వామి కన్నులు స్పర్ధకు సిద్ధమైనట్లున్నాయని భావన.

మరొక సందర్భములో దంచుతున్న స్త్రీలు అలసటను మరిచిపోవటానికి "గోవింద మాధవ గోపాల" అంటుంటే; మైనాలు; గోరింకలు; చిలుకలు; మాధ్వీక, మాధురీ మధుమాధవములు – ఇలా పశు పక్ష్యాదులు; ప్రాకృతిక అంశాలు అన్నీ స్వామిని గూర్చి ఆలపిస్తూ ఆహ్వానిస్తున్నాయిట.

అయితే, 'గోవింద మాధవ గోపాల యనుచు' అనే మకుటాన్ని చదువుతూ ఉన్నపుడు పరిమిత జ్ఞానంతో ఇది కృష్ణావతార సంబంధమైనదని భావిస్తే 'సీత, కౌసల్యాదులు పిలువటమేమిటి? అనే సందేహం తలెత్తుతుంది.

అందుకే, రచయిత తన ముందు మాటలోనే ఆ నామాల వ్యుత్పత్తిని మనకు అందజేస్తారు. శాస్త్రి గారి వివరణతో పాటు ఇతర పెద్దలిచ్చిన పాఠాంతరాలూ బహుళ ప్రాచుర్యం పొందినవే.

"గోభిః వాణిభిః విన్దతే, వేత్తి వేదాన్త వాక్యై రితి గోవిన్దః" – అంటే వేదాంత వాక్యాలచే తెలియజేయబడుటచే గోవిందుడని;

'మా' శబ్దమునకు విద్య అని అర్థం 'ధవ' అంటే అధిపతి; వేరొక అర్థంలో 'మా' అంటే 'లక్ష్మి' కావున 'మాధవ' అంటే విద్యానాథుడు లేదా లక్ష్మీనాథుడు అని;

గో – అంటే ఇంద్రియాలు వాటిని పాలించేవాడు గోపాలుడని తెలియజేస్తూ **'అనేక రూప దైత్యాన్తం నమామి పురుషోత్తమం' 'సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే'** అని నినదించిన విష్ణు సహస్రనామాన్ని జ్ఞప్తికి తెస్తారు.

కొందరు కొడుకుగా, ఇంకొందరు సోదరునిగా, నాథునిగా, భగవంతునిగా... "ఇలా ఎన్నెన్ని రూపాలలోనో కొలచి పిలిచినపుడు వారి, వారి కోరిక మేరకు కరుణించి కాచినవాడు నువ్వు పిలిస్తే రాడనుకుంటున్నావా? పిలిచిచూడు" అని శాస్త్రి గారు మనలను నిర్దేశిస్తారు. అయితే, పిలిచే ముందు వారందరిలా "నీవే తప్ప ఇతః పరంబెరుగన్" అన్నట్లు 'కేవలం పిలవటం' కాకుండా శరణాగత స్థితిని పొందటం తప్పనిసరి. అందుకే, కరుణశ్రీ ఒక సందర్భంలో "నే నీ దాసుడ నీవు నా దొరవు తండ్రీ! నూరు జన్మాలకున్ / నే నీ భక్తుడ, నీవు నా పతివి తండ్రీ! వేయి జన్మాలకున్ / నే నీ బిడ్డను, నీవు నా పితవు తండ్రీ! జన్మజన్మాలకున్ / నీ నా చుట్టరికమ్మఖండ మగు తండ్రీ బాలకోటీశ్వరా!" అంటూ జీవునికీ, దేవుని మధ్య జన్మ జన్మల అనుబంధాన్ని అందంగా ఆవిష్కరిస్తారు.



తమ ప్రార్థనలపై, తాము నమ్మిన ఆ నారాయణుని పై అమితమైన నమ్మిక వలననే బుధకౌశికముని "ఆత్తసజ్య ధనుషావఘుస్పృశావక్షయా శుగ నిషంగ సంగినౌ/ రక్షణాయ మమ రామ లక్ష్మణా వగ్రతః పథి సదైవ గచ్ఛతామ్" (ధనువు లెక్కుపెట్టి, బాణములు పట్టుకొని మూపుల అక్షయ తూణీరములు దాల్చి నన్ను రక్షించుటకు రామ లక్ష్మణులు ఎల్లప్పుడూ మార్గమునకు నాకు ముందుగా నడుచుచుందురు గాక!) అనీ, అలాగే గోపన్న "పాపము లొందువేళ రణ పన్నగ భూత భయ జ్వరాదులం / దాపద నొందు వేళ భరతాగ్రజ, మిమ్ము భజించు వారికిం / బ్రాపుగ నీవు దమ్ముడిరు పక్కియలం జని తద్విపత్తి సం / తాపము మాన్పి కాతురట, దాశరథీ కరుణాపయోనిధీ" అని అనగలిగారు.

అందుకే ఇతరములేమీ పలుక వద్దని మన నాలుకలను కూడా నియంత్రిద్దాం. 'పలుకవే! నాలుకా! పరమమౌభక్తి గోవింద మాధవ గోపాల యనుచు' అని శాస్త్రి గారి సూచనను అనుసరిద్దాం. అపుడు వారి ఈ కృషికి ఫలితం, మన జీవితాలకు ధన్యత – రెండూ సిద్ధిస్తాయి.

* **శ్రీ గొట్టుముక్కుల వేంకట సత్య నరసింహ శాస్త్రి గారి "మధుర మాధవం" ఆవిష్కరణ సభలో తేది : 29 డిసెంబర్ 2013న సమీక్ష.**
* **సెప్టెంబర్ 2014 'కళాగౌతమి' సాహిత్య పత్రికలో ప్రచురితం.**

# 7 'మమత'ల పంజరంలో ఓ మగువ జీవితం...

**తన, పర భేదం లేకుండా ఆసరా కోరిన వారందరినీ ఆదరిస్తూ ఆమె ప్రమేయం లేకుండానే చుట్టూ భవబంధాల ఊచలతో ఏర్పడిన పంజరంలో చిలుకగా మిగిలిపోయిన 'రమ' జీవితం** – శ్రీమతి ఇంద్రగంటి జానకిబాల **"పంజరం కోరిన మనిషి"** నవల ప్రధాన ఇతివృత్తం.

**ఆడపిల్లంటే – పెళ్ళి, మొగుడు, సంసారం, పిల్లలు, ఇంటిచాకిరీ, సూలింత, బాలింత, అనారోగ్యాలు – ఇవి మాత్రమే అని నమ్ముతూ; వేరే జీవితాన్ని కలలో సైతం ఊహించలేని** తాయారమ్మ, ఆమె భర్త కాలం చేసాక; వ్యవహార దక్షత గల అక్క మాణిక్యాంబ ఆసరాతో జీవితాన్ని గడుపుతుంటుంది. ఒక్కగానొక్క కూతురు రమ (కథానాయిక)కు చిన్న వయసులోనే పెళ్ళి చేసి అల్లుడి పాశవిక ప్రవర్తనను భరించలేక అతనితో తెగతెంపులు చేసి మరల మాణిక్యాంబ సహకారంతోనే కూతురుతో సహా బతుకు వెళ్ళదీస్తుంటుంది. ఈ దశలో కళావంతుల అమ్మాయి "భాగ్యం' రమ జీవితాన్ని ప్రభావితం చేసి చదువు, ఉద్యోగం పొందడంలోనే కాక ప్రతి దశలోనూ ఆమెకు మార్గదర్శిగా, సహాయకారిగా నిలుస్తుంది.

అలజడి తగ్గి కాస్త నిలదొక్కుకొనే దశలో, ఎన్ని ఉన్నా మగసంతానం లేదనే అసంతృప్తితో రగిలిపోయే తాయారమ్మ, తన భర్తకు తరువాత తనకు తద్దినాలు పెట్టేందుకు అన్నకొడుకు 'కేశవాయ్'ని దత్తత తీసుకోవడం; అతనితో పాటు అతని తల్లిదండ్రులు, ఇద్దరు అక్కలు – ఇందరి బాగోగుల కోసం రమ తన జీవన పర్యంతం శ్రమించి చివరకు తాను మాత్రం ఒంటరిగానే మిగిలిపోవడం, ఇవన్నీ కథాగమనంలో ఎదురయ్యే కీలక సన్నివేశాలు. రమ పతనాన్ని చూడాలనే ఉద్దేశ్య పూర్వకమైన లక్ష్యంతో ఆమె జీవితంలోకి ప్రవేశించిన 'దేవ్ కుమార్'తో పరిచయం ఏర్పడి, ప్రేమగా రూపాంతరం చెంది విఫలం కావడం – కథలో మరో ప్రత్యేక ఘట్టం.

***



ప్రత్యేక కోణంలో చూస్తున్నపుడు కథాగమనంలో మనోవైజ్ఞానికపరమైన అంశాలతో ముడివేసుకున్న సందర్భాలు ఎదురవుతాయి. పదేండ్ల పెద్దవాడితో హడావిడిగా రమకు పెళ్ళిచేస్తున్నపుడు **"మొగుడు లేకపోయినా సరైన వయసులో కూతురికి పెళ్ళి చెయ్యగలుగుతున్నాననే కాస్తంత గర్వం"** తాయారు పొందుతుంది. "సామాన్య కుటుంబీకుడైనా అమెరికా సంబంధం చేయగలిగాననిపించుకోవడానికి; చిన్ననాటి నుండీ అనుకుంటున్న దగ్గర సంబంధం కాదన్నారని వారం తిరక్కుండా సంబంధం కుదిర్చేయ్యాలని" – ఇలాంటి ఆభిజాత్యాలకుపోయి జీవితాంతం వాటి పర్యావసాలననుభవించే వారెందరినో అనునిత్యం మనం చూస్తూనే ఉంటాం.

కలలుగన్న లక్ష్యాలను చేరలేనప్పుడు, వేరే రంగంలో ఊహించని విజయాలు ఎదురైతే, కాసింత ఆశ్చర్యం, ఆనందతో పాటు – ఇంతటి అదృష్టం రాసిపెట్టి ఉన్నపుడు ఆ చిన్న విషయాలు ఎందుకు దక్కలేదు? అని బాధపడుతూంటాం. రమ తన మొదటి జీతం అందుకున్న రోజు ఆమె మానసికస్థితిని ఈ పార్శ్వంలో చూస్తూ **"ఆ డబ్బు పేక్లర్క్ ఇస్తుంటే రమ చేతులు వణికాయి. తనింత ప్రయోజకురాలే – తనింత అదృష్టవంతురాలే – అయినా తన బతుకు మొగ్గలోనే వాడిపోయిందెందుకు? అని ఎన్నో సార్లు ప్రశ్నించుకుంది"** అని, అంతటితో విడిచిపెట్టక **"ఈ ప్రపంచంలో చాలా ప్రశ్నలకి జవాబులుండవు"** అనే మాటతో రమ గురించి, అప్పటికే రమ పాత్రతో తాదాత్మ్యం పొందిన పాఠకుడికి తన గురించీ, తలెత్తిన నిరాశాపూరిత ఆలోచనలకు ముగింపునిస్తారు శ్రీమతి జానకీ బాల.

'మన' అనుకున్నవారే మనసు గాయపరిచినపుడు, ఎదురుపడగానే 'ఎందుకిలా చేశావ్?' అని నిలదీయాలని పరోక్షంలో ఎంతగానో సన్నద్ధమవుతాం. తీరా ఎదురుపడ్డాక అది సాధ్యపడదు. ఎందుకో 'నీది తప్పు' అని తెగతెంపులు చేసుకోవడం కన్నా, అన్నీ మరచిపోయి అసంతృప్తితోనైనా కలిసి ఉండడమే నయమనిపిస్తుంది – కొందరి విషయంలో. అన్ని సందర్భాలూ బంధాలు తెంచుకునేంత పెద్దవి కావు. కానీ, ఆ గాయపడ్డ క్షణాలు మనలో ఈ విజ్ఞతను మరుగుపరుస్తాయి. తల్లి గురించి రమ భాగ్యం దగ్గర బాధపడినపుడు **"ఏవేవో లోపల ఇంకిపోయిన**

**అసంతృప్తులే ఇలాంటి అసహనానికి కారణాలవుతాయి – నిలబెట్టి ఎందుకిలా అన్నావ్ అంటే వాళ్ళు సమాధానం చెప్పలేరు. బావురుమంటారు"** అని భాగ్యంచేత పలికిస్తూ క్షణికమైన ఉద్వేగంలో శాశ్వతమైన బంధాలను విచ్ఛిన్నం చేసుకోరాదని మార్గదర్శనం చేస్తారు జానకీబాల.

ఈ సందర్భంలో Dale Carnegie యొక్క "When dealing with people, remember you are not dealing with creatures of logic, but with creatures of emotion" అనే quotation జ్ఞప్తికి తెచ్చుకోవాలి. అన్నిరకాల ఉద్దీపనలకూ అందరు వ్యక్తులూ ఒకే విధంగా స్పందించరు, ఒకే వ్యక్తి కూడా అన్ని సందర్భాలలోనూ ఒకేలా స్పందించడు; వ్యక్తులతో వ్యవహరించేటపుడు ఉద్వేగాలు, వ్యక్తిగత, శారీరక మానసిక అంశాలు, అన్నిటికీ మంచి వారి పూర్వానుభవాలు – దృష్టిలో ఉంచుకోవాలి అందుకే, కథలో తాయారు, రమల మధ్య నడిచిన అన్ని సన్నివేశాలలోనూ మనం తాయారు ప్రవర్తన రమకు ఇబ్బంది కలిగిస్తోంది అని తప్ప ఆమెకు రమ పట్ల ప్రేమ లేదనే ముగింపునకు రాలేం.

వ్యక్తి తనలో తనకు నచ్చని అంశాలకు వేరే వాటిని కారణంగా చూపించి స్వాంతన పొందుతాడు. భాగ్యం పెళ్ళి సందర్భంలో మొదటిసారి రమ బట్టలషాప్‌కి వెళ్ళి, నిలువెత్తు అద్దంలో చూసుకొని ఉలిక్కిపడి, తన రూపం తనకే వికారం కలిగించినపుడు **"అబ్బా! ఏమిటీ అద్దాలు చిరాకు కలిగించేలా"** అంటుంది. Defense mechanismలో విస్థాపనం (Displacement)కు ఉదాహరణగా ఈ ప్రవర్తనా రీతిని సైకాలజిస్టులు పేర్కొంటారు.

మనం నిరాశలో ఉన్నపుడు అనునయించే వ్యక్తులు సాధారణంగా ఉపయోగించే మాటలు "నువ్వు మంచివాడివి, నీ మనసు మంచిది, నీకు దేవుడు అన్యాయం చెయ్యడు" అని. ఎందుకో, ఈ మాటలు ఎంతో ప్రభావవంతంగా పని చేస్తాయ్. కొత్త ఉత్తేజాన్నిచ్చి బ్రతుకుపట్ల ఆశలు చిగురింపచేస్తాయ్. నిజానికి అత్యున్నతమైన ప్రశంస "నువ్వు మంచాడివి" అనడమేనేమో! అందుకే, రమ తన బాధలు పంచుకుంటున్నపుడు పెద్దమ్మచేత ఇవే మాటలు అనిపించడం సందర్భోచితంగా ఉంటుంది.

***



కథలో వివిధ దశలలో పాత్ర స్థితిగతులను తెలియజేసేందుకు రచయిత్రి అనేక ప్రతీకలను వినియోగించుకుంటారు. కొన్ని సందర్భాలలో అవి నేరుగా మనసును చేరుకుంటే మరికొన్నిసార్లు గూఢంగా, గాఢంగా తాకుతాయి.

ఇన్నేళ్ళుగా, తనపైనే ఆధారపడి జీవిస్తున్న తల్లి, మావయ్యతో **'నువ్వెన్నైనా చెప్పరా! ఆడపిల్ల ఆడపిల్లే – మగపిల్లాడు మగపిల్లాడే – ఏం చదివినా, ఎంతపెద్ద ఉద్యోగం వెలగబెడుతున్నా, మగాడికున్న దర్జా ఆడదానికి ఛస్తేరాదు"** అన్నపుడు **"చుయ్యిమనే శబ్దం వచ్చింది. దానితోబాటు కిటికీలోంచి నూనెపొగ గుప్పుమని కనిపించింది"** అనడంలో రమ హృదయం దహించుకుపోతున్న సన్నివేశాన్ని; "చుయ్యిమని వెంటనే చల్లారిపోవడం'లో ఆమె నిస్సహాయతనూ, ఓరిమినీ సూచిస్తారు రచయిత్రి.

**"పెద్దమ్మ ఇంట్లో అడుగుపెడుతుంటేనే ఎండిపోయిన మొక్కలతో దీనంగా తను పెంచిన పూలతోట కనిపించింది. ఇపుడు చావలేక బతికినట్లుగా మందారచెట్టు; పెంకుల మీదకు పాకిన జాజిచెట్టు – దూరంగా చీడపట్టిన కరివేపచెట్టు దర్శనమిస్తుంటే రమకి ఏడుపొచ్చినంతపనైంది"** – ఇది ఒకనాటి పెద్దమ్మ వైభవం, నేడు ఎవరికీ పట్టని ఆమె దుస్థితి మన కళ్ళ ఎదుట నిలుపుతుంది.

భాగ్యం సలహాతో జుట్టు కాస్త వదులుగా జడవేసుకుని, బొట్టు పరిమాణం తగ్గించినపుడు భ్రమరాంబ (అత్తయ్య) పరిశీలనగా ముఖంచూసి చక్కగా ఉందన్నపుడు **"ఆకు దూసేసిన మల్లెచెట్టు దగ్గర నిలబడింది. కనీ కనిపించకుండా వస్తున్న చివురు చెట్టంతా కనిపించింది"** అంటూ ఆమె జీవితంలో ఏవో కొత్త చివురులకు ఆవకాశం ఉందేమో అనే ఆశను పాఠకునిలో రేకెత్తిస్తారు.

**"ఇంటి ముందు తోటలో మొక్కలు నవనవలాడటం లేదు. ఎన్ని నీళ్ళు పోసినా, ఎంత పోషణ చేసినా అవి అంతంత మాత్రంగానే వుండిపోతున్నాయి. ఒకసారి 'నర్సరీ' వాడ్ని తీసుకొచ్చి చూపించింది. అతను అంతా చూసి మట్టి చౌడు తేరిపోయిందమ్మా – మొత్తం ఓ పదిబళ్ల కొత్తమట్టి తోలించండి అని సలహా చెప్పాడు".** ఈ సందర్భంలో రచయిత్రి కొనసాగింపుగా **"రమకి అక్కడక్కడా తెల్ల వెంట్రుకలు**

**కనిపిస్తున్నాయి. అక్కా అని పిలిచే పిల్లలు ఇప్పుడు ఆంటీ అంటున్నారు"** అంటూ ఆ తోటను రమ జీవన చిత్రానికి ప్రతిబింబంగా చూపుతారు.

కేశవాయి విదేశాలకు వెళ్ళాక **"ఏదో ప్రోత్సాహం కలిగి నెమ్మదిగా చిగుళ్ళు వేసి, మొగ్గలేస్తోంది – కొన్ని గడ్డి పువ్వులూ పూస్తోంది. నిలదొక్కుకోవడానికి మట్టిలో బలం లేదు. తనకి భవిష్యత్తు మీద ఆశ లేదు – ఇలా పడుతూ, లేస్తూ ఉండడమే"** అంటూ పూస్తున్నవి గడ్డిపువ్వులే అని; అవి సైతం నిలదొక్కుకోవడానికి మట్టి బలహీనమైనదన్న విషయాన్ని సూచనప్రాయంగా తెలియజేస్తారు.

***

**"నిజంగా ప్రతి తల్లీ అంత నిస్వార్థపరురాలే అయితే, ఇంతమంది అనాథ లెక్కడ నుంచి వచ్చారు?" "ఆడపిల్లలు పెళ్ళయి, అత్తారింటికిపోయి, అక్కడ కష్టాలు పడుతూ, అప్పుడప్పుడూ వచ్చి, ఏడుస్తూ అవీ, ఇవీ చాడీలు చెప్తూ తల్లుల సానుభూతి కోరితే అది ఆ తల్లిదండ్రులకు బాగుంటుందేమో గానీ పుట్టింట్లోనే నిలవుండిపోతూ కూర్చుంటే వాళ్లకి విసుగనిపిస్తుందేమో"...** ఇలా ఈ నవలలో ఏ రచయిత చెప్పడానికి సాహసించని నిజాలు వింటాం; ఊహించని విధంగా రచయిత్రి సంధించే ప్రశ్నలనూ ఎదుర్కొంటాం. అంటే, కష్టమో, నష్టమో మనిషి అందరిలా బతకాలే గానీ, ఏ తప్పూ చెయ్యకపోయినా ప్రత్యేకంగా మాత్రం బతకడాన్ని ఈ సమాజం ఒప్పుకోదు. అలాగే, స్త్రీ పురుషుడిని కాదనుకున్నా, ఆ వదిలేసిన ఘనత ఆ మగమహారాజుకే కట్టబెడతారని **"ఈ వదిలేసిన మొగుడు రమను బాధిస్తున్నాడు అని ప్రతీ వాళ్ళు అంటుంటే ఆమెకు ఎంతో చిన్నతనంగా వుంది"** అంటారు జానకీబాల.

**"పేరంటాలకు వెళ్ళినపుడు ఎవ్వరూ పెదవివిప్పి ఒక్కమాటైనా అడగక పోయినా చూపులతో శల్య పరీక్ష చేస్తారు"** – వాళ్ళకి ఉన్న అపురూప వస్తువేదో తాను కోల్పోయినట్లు అంటూ **"మొగుడు ఎలాంటి వాడయినా వాడు వదిలేసిన పునిస్త్రీతనం మీద విపరీతమైన మోజున్నవాళ్ళు వాళ్ళంతా. ఇప్పుడు కట్టుదిట్టాల్లో పూజలు, పునస్కారాలు చేసుకుంటే వచ్చే జన్మకైనా మంచి మొగుడు వస్తాడనే నమ్మకంతో ఉన్నవాళ్ళు వాళ్ళు"** అని సాహసోపేతంగా విమర్శిస్తారు.



భాగ్యం ప్రసవ సమయంలో ఆమెను చూడడానికి రమ హైదరాబాద్ వెళ్ళాలనుకున్నపుడు అంగీకరించని తల్లి, తనకంటే ఎంతో చిన్నవాడైన కేశవాయ్ తోడొస్తాననడంతో ఒప్పుకుంటుంది. అంటే, తన కాళ్ళపై తాను నిలబడి ఏళ్ల తరబడి ఉద్యోగం చేస్తూ కుటుంబాన్ని నడుపుతున్న స్త్రీ కన్నా ఇంకా సరిగా మీసం మొలవని మగవాడి సామర్థ్యంపైనే ఈ సమాజానికి నమ్మకం ఎక్కువ. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" వాక్యాన్ని ఈ సన్నివేశం గుర్తుచేస్తోంది కదూ...!

ఇక నవలకు శిఖరాయామానమైన సన్నివేశంలో **"మీ కులానికి చెందిన నా తండ్రి మమ్మల్ని అన్యాయం చేసాడు. అందుకే, మీ కులంపై గల ద్వేషంతోనే ప్రేమించినట్లు నటించి నిన్ను పతనం చేసి నా పగ తీర్చుకుందామనుకున్నాను. కానీ నీలో ఉన్న అమాయకత్వం, మంచితనం, నువ్వు నా మీద ఉంచిన నమ్మకం... ఇవన్నీ నిన్ను ఏమీ చేయకుండా విడిచిపెట్టి, నిజం చెప్పేలా చేస్తున్నాయ్"** అన్న దేవ్ కుమార్‌తో రమ **"నన్నేం చెయ్యలేకపోయానని బాధపడకండి. నన్ను చెరచి పూర్తిగా సర్వనాశనం చేసారు. మనిషికి శరీరమే కాదు, మనసు కూడా ఉంటుంది. నిజానికి అదే ఎంతో ముఖ్యం కూడా"** అన్నపుడు మనిషంటే మనసే అన్న విషయాన్ని మనుషులెందుకో మర్చిపోయారనిపిస్తుంది. "తలకొరివి పెడతాడని పట్టుబట్టి దత్తత తీసుకున్న కేసవాయ్ తాయారు మరణించే నాటికి విదేశాలలో ఉండిపోవడం" విధి వైచిత్రిని తెలియజేస్తుంది.

........ఇలా, రమ పంజరాన్ని కోరుకుందా? లేక పంజరమే ఆమెను కోరుకుందా? ఏదయితేనేం! ఆమె కథను తెలియజేస్తూనే 1980–1995 కాలం నాటి రాజకీయ స్థితిగతులు, తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం, రంగా హత్య, పదవీ విరమణ వయస్సు 58 నుండి 55కు రావడం, దాని గురించి జరిగిన చర్చలు, అనంతర పరిణామాలు, కార్యాలయాలలో రాజకీయాలు, వాటిపై బయటి రాజకీయాల ప్రభావం, ఉద్యోగినుల వ్యక్తిగత విషయాలలో ఇతర ఉద్యోగుల జోక్యం; విభిన్న కులాలు, వర్గాల మధ్య తలెత్తే సమస్యలు; Ego Problems; Complexes వీటన్నిటితో సమాంతరంగా సంవిధానం చేస్తూ నవలారచనలో తన పరిణతిని ప్రదర్శిస్తారు జానకీబాల.

అయితే "స్వశక్తితో ప్రతిభావంతంగా పైకెదిగి, భాగ్యం నుండి అనేక జీవిత పాఠాలను నేర్చుకుని పెద్దమ్మ మార్గదర్శనంలో జీవన వైపరీత్యాలన్నిటినీ ఎదుర్కొని; ఉద్యోగ జీవితంలో వ్యక్తులను, వ్యక్తిత్వాలను అవగతం చేసుకున్న రమ, తాను తలుచుకుంటే తన చుట్టూ ఏర్పడిన పంజరంలో చిక్కకుండా తనను కాపాడుకోలేదా? కానీ, రమ ఎవరో పరాయి వారికోసమో, నిజానికి వందశాతం సమ్మతితోనో ఈ త్యాగాలు(?) చెయ్యలేదు. పోనీ, తనచుట్టూ వారంతా రమకు అన్యాయం చేసారా? అని ప్రశ్నించుకుంటే వారి కోణాలలో వారికి మరో ప్రత్యామ్నాయం లేదేమో అనిపిస్తుంది.

అందుకే **"న్యాయం అనేది ఒక నిర్దిష్టమైన రూపంలో ఉండదు. అది సమయాన్ని బట్టి, మనుషుల్ని బట్టి, కాల ప్రభావాన్ని బట్టి నిరూపించబడుతుంది. ఎప్పట్నించో ఉన్న ఆచారాలు, న్యాయాలు, ధర్మాలూ, అన్నీ మారిపోతున్నాయి. ఇప్పుడున్నవీ శాశ్వతమని చెప్పడానికి వీలులేదు".** బహుశా ఈ విషయాన్ని స్పష్టం చేయడమే రచయిత్రి లక్ష్యం కావచ్చు. అందుకే, కుటుంబ జీవనంలో లాజిక్‌లకు తావు లేదు. అలాగే adjustment తప్ప judgment పనికిరాదు. "come what may" అన్నట్లు బతుకు ఎలా బతకనిస్తే అలా బతికెయ్యాలి.

ఇక రచనా విధానాన్ని పరిశీలిస్తే రచయిత్రి ఎక్కడా సస్పెన్స్ కోసం ప్రయత్నం చెయ్యలేదు. "రమకు అనారోగ్యంగా ఉన్నపుడు పలకరించడానికి వచ్చిన దేవకుమార్‌ని లలిత లోపలికి ఆహ్వానిస్తున్నపుడు **"ఆమె తడబడి కొత్తగా వేసుకున్న ఓణీ జారిపోతుంటే ఇదేనండి ఇల్లు-రండి అంది. దేవ్ కుమార్ అరక్షణంలో లలితని నఖశిఖపర్యంతం చూసి లోపలికి వచ్చాడు"** ఈ సందర్భంలో కథలో తరువాత జరగబోయే మలుపును కొంత ఊహించుకోగలుగుతాం. అయితే, మన ఊహ నిజమేనా? కాదా? అని మూల్యాంకనం చేసుకునే క్రమంలో చదివేస్తాం.

***

సాధారణంగా చదివించే కథలు రెండు రకాలు. ఏకబిగిన చదివించేవి కొన్నయితే, ఆపిన కాసేపటికే మళ్ళీ చదవాలనిపించేవి మరికొన్ని. ఇది రెండవ వర్గీకరణకు చెందిన కథ.



**ఎందుకంటే,**

**"వ్యక్తురాలయినా ఇంకా శారీరకంగా సన్నద్ధత లేని రమతో కాస్త సున్నితంగా వ్యవహరించు నాయనా!" అని సూచించిన తాయారుపై అల్లుడు అత్యాచారం చేసినపుడు....**

**తనను ఎత్తుకుని పెంచిన మావయ్యకు భార్య పోయిన తరువాత పెళ్ళి చేసుకోమని కన్నతల్లే సలహా ఇచ్చినపుడు....**

**తనకు బతుకునిచ్చిన పెద్దమ్మ చివరిదశలో నీ దగ్గర యాభై రూపాయలుంటే ఇద్దు అని రమను అడిగినపుడు....**

**తనను ప్రేమపేరిట వంచించిన దేవ్ కుమార్ తన లాలనలో పెరిగిన లలితనే పెళ్ళి చేసుకున్నపుడు....**

**అల్లుకున్న బంధాలన్నీ వాటికవే వీగిపోయి, రమ జీవితం ఏదైనా కొత్త చివురులు వేయబోతోందా? అని పాఠకుడు ఆశించేంతలో - ఆమె మెనోపాజ్ దశకు చేరుకుందని డాక్టర్ చెప్పినపుడు....**

పడుకుని గుండెలపై ఉంచి చదువుతున్న 150 పేజీల పుస్తకం ఒక్కసారిగా 150 కేజీలుగా అనిపించి మోయలేక పక్కకు తోసేసినా, కొద్దిసేపటికే మళ్ళీ చేతుల్లోకి వచ్చి మళ్ళీ మళ్ళీ చదివించుకుంటుంది.

***

*** నవల ఆవిష్కరణ సందర్భంగా జూన్ 8, 2014న సమీక్ష.**
*** మార్చి 2015 "చినుకు" మాసపత్రికలో ప్రచురితం.**

# 8 కవితామయ జీవితాన ఓ "వాన కురిసిన రాత్రి"

కొన్ని సందర్భాలలో కవిత్వాన్ని గురించి మాట్లాడుకునే ముందు 'కవిత'ల భౌతిక రూపాన్ని గురించి కొంత చెప్పాలనిపిస్తుంది. ఎందుకంటే, కవిత్వం కవి తాలూకు సృజన శక్తిని, అంతర్గత పరిణతిని తెలియజేస్తే 'రూపం' వారి కళాత్మక దృష్టిని మనకు అందజేస్తుంది. ఈ కోణంలో చూసినపుడు డా. బండి సత్యన్నారాయణ కవిత్వంలో కనిపించే అరుదైన విషయం – కవితలన్నీ ఏకరీతిగా సమత్వంతో ఉండడం. కేవలం పరిమాణంలోనే కాకుండా స్థాయి, అభివ్యక్తి, శబ్ద సౌందర్యం – వీటన్నిటిలోనూ సమత్వం సాధించడమనేది అంత సాధారణమైన విషయం కాదు. కారణమేమంటే, కవి ఎప్పుడూ ఖాళీగా ఉండడు. ఏదో ఒకటి రాస్తాడు లేదా చదువుతాడు. ఈ క్రమంలో పై మూడు అంశాలలో నిరంతరంగా మార్పు చోటు చేసుకుంటుంది. అలా మార్పుకు లోనుకాకుండా ఒక పుస్తకం గడిచిపోయింది. అంటే అది ఖచ్చితంగా ప్రవాహసదృశంగా, ఒకే దఫాలో (at a stretch), ఒకే mood లో మొదలుపెట్టి పూర్తి చేసినదై ఉండాలి. ఇది ఎందరికి సాధ్యం? ఏమో! కానీ, శ్రీ శివారెడ్డి అన్నట్లు – 'తను నిలకడగా, నిబ్బరంగా, జీవితాన్ని కవిత్వం చేసే సుదీర్ఘ యాత్రలో, యుద్ధంలో మునిగిపోయినవారు శ్రీ సత్యన్నారాయణ గారు; కవిత్వ జీవన సాధనాక్రమంలో ఉన్న ఇలాంటి వారికి ఇవేవీ అసాధ్యం కాదు.

తన గీతాంజలి అనువాదానికి ముందుమాటలో చలం అన్నట్లు – గొప్ప కవిత్వంలో ప్రధాన లక్షణమేమంటే, ఎవరి తాహతుని బట్టి వారికి ఏదో కొంత అనుభూతిని అందించగలగడం. కొంత స్పష్టంగా తెలుస్తుంది. కొంత అస్పష్టంగా తెలుస్తుంది. కొంత మనసుని మించిన అనుభవంలోకి వెళ్ళి తెలిసినట్టు అసలు తెలీకుండానే తెలుస్తుంది. అలా, కొంత స్పష్టంగా; కొంత అస్పష్టంగా; తెలిసినట్టు అసలు తెలీకుండానే తెలిసిన సంగతులు కొన్నిటిని మీ ముందుంచుతాను.

***



ఏదయినా ఒక రోజు కవితలో... **"ఒకసారయినా ఇలా చెయ్యాలి/ గడియారం ఎనిమిది కొట్టినా / అటూ, ఇటూ జరిగిపోయిన దుప్పటిని / తల మీదుగా తీసుకుని / కాళ్ళతో తన్నిపెట్టి / మళ్ళీ కళ్ళు మూసుకోవాలి; తొమ్మిదో పదో అవుద్ది / అతను తెచ్చిచ్చే వేడి వేడి కాఫీ తాగాలి / మామూలుగా కాదు / రెండు మూడు సార్లు బతిమాలించుకుని తాగాలి; నేనలా బయటికి వెడుతున్నా – అన్నం, కూరలు బల్లమీద పెట్టా; చల్లారిపోకుండా తిను – ఈ మాటలు వినాలి".**

బహుశా చాలా మంది స్త్రీల జీవితాలలో ఇలాంటి శలవు రోజులు కలలో కూడా ఉండవేమో? అందుకే, 'ఒక్కసారయినా' అనడంలో కోరిక యొక్క అసాధారణత్వాన్ని; తొమ్మిదో, పదో అనడంలో కోరిక పరిమితి దాటలేదు అనే స్పష్టీకరణను వ్యక్తం చేస్తూ 'అతను' అనే పదంలో కవిత తాలూకు జీవాన్ని నింపుతాడు కవి. నిజానికి 'అతను' అనేది లేకపోతే పై వాక్యాలన్నీ సర్వసాధారణాలే. అంటే చాలా మంది పురుషుల దినచర్యను కాసేపు ఒక స్త్రీకి ఆపాదించేసరికి అది కవిత్వమయింది; ఆకాశంలో సగం అనుకుంటున్న స్త్రీ జీవితంలో నేటికి ఎన్నో అంశాలు అందని ద్రాక్షలే. ఈ అంశాన్ని ఇంత హృద్యంగా కవిత్వీకరించిన తీరులో కవి పరిణతి వ్యక్తమవుతుంది.

***

ఎవరినుండయినా సహాయాన్ని పొందిన తరువాత – "అవసరం లేదేమోనని కొన్నిసార్లు; అవతలి వాళ్ళు తగరని కొన్నిసార్లు; సహాయాన్ని డబ్బుగానో, మరో రూపంలోనో అనువదించి మరికొన్నిసార్లు; మనం సహాయం పొందామని కాక వారికి అవకాశమిచ్చామని చాలాసార్లు భావించి కృతజ్ఞతలు చెప్పడం కావాలని మరిచిపోతుంటాం.

**"కొన్ని ధన్యవాదాలో / లేక కొన్ని కృతజ్ఞతలో / పొట్లం కట్టి అతని జేబులో పెట్టు / ఆ ఒక్కమాట కోసమే / వెనక్కి తిరిగి తిరిగి చూస్తారు / నువ్విచ్చే ఆ మహా వాక్యాన్ని కళ్ళకద్దుకుని / తనకిష్టమైన పుస్తకంలో / నెమలీకలా / మహాప్రేమగా దాచుకుంటాడు"** అంటూ ఒక చిన్న కృతజ్ఞత అవతలి వ్యక్తి మనస్సులో ఎంత అవ్యక్తానుభూతిని నింపుతుందో తెలియజేస్తారు – 'ఆ ఒక మాట కోసమే' కవితలో.

***

ఇక, వాన కురిసిన రాత్రి కవిత విషయానికొస్తే...... నిజానికి తిలక్ "అమృతం కురిసిన రాత్రి" సంపుటిలో "వాన కురిసిన రాత్రి" పేరిట ఒక కవిత ఉంది. బహుశా తిలక్ పట్ల ఆరాధనతోనే వీరీ సంపుటికి ఆ పేరు పెట్టుకున్నారేమో! అంతేకాక, తిలక్ ఆర్తగీతంలో **"నేను చూసాను నిజంగా అని మొదలుపెట్టి – ఆకలితో అల్లాడి మర్రిచెట్టు కింద మరణించిన ముసలాణ్ణి; నీరంధ్ర వర్షాన వంతెన కింద నిండు చూలాలు ప్రసవించి మూర్ఛిలిన దృశ్యాన్ని; పిల్లలకు గంజి కాసిపోసి తాను నిరాహారుడై రుద్ధబాష్పాకులిత నయనుడై ఆఫీసుకు వచ్చిన వృద్ధుని; ఫ్యూన్ వీరన్నని"** వీరందరినీ చూసినట్లే శ్రీ సత్యనారాయణ "నీ తలమీద పడగ విప్పిన విషసర్పాన్ని; నీ కాళ్ళ చుట్టూ ఘనీభవించిన మృత సముద్రాన్ని; ఆకలి సెమ్మను; చెమట చేదును; తెగిపడ్డ శరీర భాగాల వేడి రక్త స్పర్శను......." ఇలా ఎన్నిటినో చూసారు.

వానకు తానూ, గుడిసె రెండూ తడిసిపోయాక **"తడిసిపోయిన గుడిసె ఏం మాట్లాడుతుంది / మాట్లాడగలిగే నేను మాత్రం చేసేదేముంది / క్రమంగా వాన తగ్గింది / తడిసిపోయిన గుడ్డల్ని పిండుకుంటూ నేను / చెదిరిన గుండెను చేరదీసుకుంటూ నా గుడిసె"** అంటూ జీవాధారమైన వాన కొందరి అభాగ్యుల జీవితాలను మరింత దుర్భరంగా మార్చే మరో పార్శ్వాన్ని ప్రతీకాత్మకంగా వర్ణిస్తారు.

***

మనుషులవుతారు కవితలో **"రెండు కనుగుడ్లనూ పీకి / గోళీకాయల్లా అలా వాకిట్లోకి విసిరేసాను / ప్రాణం మహా సుఖంగా వుంది / కుళ్ళుతోనూ, కంపుతోనూ / రొచ్చుతోనూ నిండిపోయిన / దేహాన్ని కూడా కాసేపు వొదిలేసాను / పరమ సుఖానుభూతిని పొందాను / చంటి పిల్లాడు / అలా నేల మీద పాక్కుంటూ వెళ్లినట్లు / కాసేపలా రోడ్డు మీదకి వెళ్లాను / అటూ ఇటూ పరుగులు తీస్తున్న వాళ్ళలో / ఎవడో ఒకడ్ని ఆపి / ఏదో చెప్పబోయాను, వింటే కదా! నన్ను పట్టించుకునే తీరిక కోరిక వాళ్ళకి లేదు / కొద్దిసేపటి క్రితం వాళ్ళలో నేనూ ఒకణ్ణి / ఇప్పుడు వాళ్ళు వేరు / నేను వేరు / నేను మనిషిని / వాళ్ళు మనుషుల్లాంటి వాళ్ళు"** అంటూ చిత్రంగా ఈ కళ్ళను, ఈ దేహాన్ని విడిస్తేనే గానీ మనుషులం కాలేము అని; ఇవి



మనలను మనిషిగా మనుగడ సాగించడానికి అవరోధంగా నిలుస్తున్నాయని నర్మగర్భంగా చెబుతారు.

***

**"టీ తాగుతూ / నేను / నా వెనుకాల / నా నీడలో / శిరస్సు మీద ప్రవహిస్తున్న అలల మీదుగా / ఎక్కడో దూరంగా తుమ్మచెట్టు కింద / నులక మంచం మీద కూచొని / నాన్న కన్నీటి చెలమల కింద / తడిసిపోతున్న అమ్మ చిరుగుల చెంగు చూసాను. బహుశ నా మిత్రుడు కూడా / తన టీ కప్పులో / ఏదో ఒక రక్తమోడుతున్న దృశ్యాన్ని చూసే ఉంటాడు".**

అంటే, గుర్తుంచుకునేందుకు, పునశ్చరణ చేసుకునేందుకు వారికి కన్నీటి తోనో, రక్తంతోనో తడిసినవి తప్ప మరో జ్ఞాపకాలు లేవని చెప్పకనే చెబుతారు. నిజానికి ఇలాంటి బాధల గతాన్ని ఏకరువు పెట్టడానికి కవితను అనేక విధాలుగా మొదలుపెట్టవచ్చు. కానీ ఈ సందర్భాన్నే ఎంచుకోవడం కవి ప్రత్యేకతను తెలియజేస్తుంది.

***

పెద్ద కూతురొస్తే చాలు – **"పూరించి, పూరించి ఉన్నపళంగా తొలకరి వానొచ్చినట్టే; సొంత తాడి కల్లు, చేపల కూర, కోడికూర, రొయ్యలకూర, కొత్త పంచి తువ్వాలు, ఉల్లిపాయ పకోడి, బెల్లం మిఠాయి – శుక్లాలతో మూసుకుపోయిన నా కళ్ళకి కొత్త చూపు; కొత్త చెప్పులు – ఒక్కటేమిటి – చచ్చిపోకుండా శాశ్వతంగా ఇక్కడ ఇలాగే ఉండిపోవటానికి నాకేం కావాలో అన్నీను – ఏం తెచ్చినా లేకపోయినా గంపెడు ప్రేమను మోసుకొస్తుంది".**

ఇక్కడ కూతురు రాకను చాలా సరళంగా చెప్పినట్లు అనిపించినా, కవి మొదటి వాక్యంలో వాడిన పదాలు ఆ రాకకు ప్రాధాన్యతను ఆపాదిస్తాయి. అవి "పూరించి, పూరించి", "ఉన్నపళంగా" "తొలకరి". ఇక శాశ్వతంగా ఉండిపోవాలనే కోరిక – 'లేదన్నది లేకుండా అన్నీ ఉన్నాయనుకున్నప్పుడే కలుగుతుంది'. నిజానికి, ఉండడమంటే అన్నీ ఉండడం కాదు. లేనిదేదీ లేకపోవడం అంటారు తాత్త్వికులు. అదిగో అలాంటి స్థితిని ఆమె రాక కల్పిస్తుంది అని కవి భావన. అయితే,

దశలవారీగా ఆమె రాక తెచ్చిన ఆనందాన్ని వ్యక్తపరిచే క్రమంలో కొన్నిసార్లు శిఖరాయమానమైన పాదాల తరువాత ముగింపు "నా పెద్ద కూతురొస్తే చాలు నాకు మందులతో పన్లేదు" అని సాధారణంగా ఉండడం పాఠకుడిని నిరాశపెడుతుందేమో?

***

నీ వల్లే, నీ వల్లే కవిత – వ్యక్తి పునర్నిర్మాణాన్ని స్ఫూర్తివంతంగా తెలియజేస్తుంది. – **"పాన్ షాప్ పక్కన / అంటించి వదిలేసిన దొక్కతాడులా / కాలుతున్న కాలం గురించి / దుఃఖంగా దిగులుగా ఎందుకు / ఇంటికి కొత్త రంగేసినట్టు / పైకప్పు విప్పి దులిపి మళ్ళీకట్టుకున్నట్టు / కుసులూడిపోయిన పట్టి మంచాన్ని / మళ్ళీ బిగించుకున్నట్లు / తొక్కేసిన పూలమీద కొత్త పూలురాలినట్టు / ఈ పాత దుఃఖసమయం మీద / ఓ కొత్త సమయాన్ని / కొత్త మనుషులని / డబ్బుకీ, ఆస్థులకీ అతీతంగా – నువ్వే సృష్టించుకో"**

కాలాన్ని పాన్ షాప్ పక్కన అంటించి వదిలేసిన దొక్కతాడుతో పోల్చడం; తొక్కేసిన పూలమీద కొత్తపూలు రాలినట్టు అనే వాక్యాలు రేడియోలో వార్తలు చదువుతూ మధ్య మధ్యలో "ఆకాశవాణి – మీరు వార్తలు వింటున్నారు" అన్నట్లు మీరు కవిత్వం చదువుతున్నారు అని ఒక్కసారి మనకు గుర్తు చేసి పరవశానికి గురిచేస్తాయి.

***

దోసెడు నీళ్ళు కవితలో – **"దోసెడు నీళ్ళు తీసుకొని / తన ముఖాన్ని చూసుకుంది / ఎప్పటిదో తన చిన్నప్పటి ముఖమది / ఓ జ్ఞాపకాల గాలి కెరటం ఉవ్వెత్తున ఎగసింది / సందకాడ లేత వెన్నెల్లో / చెట్ల నీడల్లో ఆడిన దాగుడు మూతల్ని తెచ్చి / ఆమె దోసిట్లో పోసింది / మందారచెట్టు కింద వదిలేసి వచ్చిన / పాలపిట్ట రంగు చీర కట్టబెట్టిన / తాటాకు బొమ్మను తెచ్చి ఇచ్చింది / కొబ్బరి చిప్పల్లో ఉత్తిత్తిగానే వొండిన / బువ్వలాటల రుచిని మళ్ళీ గుర్తుకు తెచ్చింది / ఇంకా చాలా జ్ఞాపకాల్ని దోసెట్లో పోసి / నది అదృశ్యమైంది / ఆమె దోసిట్లో నీళ్ళన్నీ కళ్ళల్లో చేరిపోయాయి / బహుశా ఆమె నేడో, రేపో / ఒక్కసారి తన పుట్టింటికి వెళ్ళొస్తాది"** ఇలా, పదిలంగా మదిలో దాచిన పసిప్రాయపు స్మృతులను మన ముందుంచుతూనే **ఆమె దోసిట్లో నీళ్ళన్నీ కళ్ళల్లో చేరిపోయాయి** అంటూ మన కళ్ళనూ ఒకసారి చెమ్మగిల్లజేసి – ఇన్ని గుర్తొచ్చాక వెళ్ళకుండా ఎలా ఉంటుంది అని మన చేతే అనిపిస్తారు.



***

**"ఓ వర్షాకాలపు సాయంత్రపు వేళ / సన్నగా కురిసే వానలో / బండి తీసుకుని / చిన్న చిరునవ్వు తోడు తీసుకుని / దారిలో / చెట్టుకింద / తోపుడు బండి దగ్గర / తన కోసమే దోరగా వేగిన మిరపకాయ బజ్జీ / పరపరా నమిలేసి / పొట్టి గాజు గ్లాసుతో యిచ్చిన / వేడి వేడి చిక్కటి టీ తాగేసి / అలా బీచ్‌రోడ్డుకి వెళ్ళి / సముద్రం పాడిన పాటలు కొన్నింటిని / మెడలో వున్న పౌచ్‌లో వేసుకుని / ఇంటికి రావాలని కదా! తను కలగంది / ఏమయింది/ వెళ్ళిందా లేదా? / చూద్దాం / బండుంది / వానుంది / కోరికా ఉంది / అప్పుడే పూసిన కలా ఉంది / తాను వెళ్లడం ఒక్కటే లేదు / లక్షా తొంభై కారణాలు / పరాయివాళ్ళవే కాదు / ఇంట్లో వాళ్ళవి కూడా"**

స్త్రీల ఆలోచనలు, భావాలు, అణగద్రొక్కబడుతున్న వారి కోరికలు – వీటిని గురించి స్త్రీలే రాయగలరా? ఇంట్లోను, సమాజంలోనూ తన స్వల్పమైన సరదాలను సైతం తీర్చుకోవడానికి ఎదురవుతున్న ప్రతిబంధకాలను గురించి ఎంతో సున్నితంగా తెలియజేస్తారు – 'శైలు ఎలా కలగంది' కవితలో. ఈ స్థితిని 'పిచ్చిమాలక్ష్మి' కవితలో **"చిన్ని చిన్ని సరదాల్ని – కర్ఛీఫ్ మడతల మధ్య ఫేస్ పౌడర్‌లా దాచి / ఓ మబ్బు పట్టిన చల్లని సాయంత్రపు వేళ వెన్ను గడపకానించి టీ తాగుతూ / ఇంద్రధనుస్సుని చూస్తూ గడపాల్సిన సమయాల్ని / పోపుల డబ్బాలో కోమాలో ఉన్న కలల్ని / వంట గదిలో సింక్ గుండా డ్రైనేజీలోకి జారిపోయిన వసంతాల్ని మరిచిపోయి'** అంటూ; మరోచోట నిత్యాగ్ని హోత్రి కవితలో – **"భుజాలు మీద ఎగిసిపడే సముద్రాలతో / ఒక్క కన్నీటి బొట్టు కూడా నేల రాలకుండా / ఆమె ఎంతసేపయినా ఆ గోళం మీద నిలబడగలదు / సూర్యుడు రాకపోయినా / సునామీ వచ్చినా / ఆమె ఆ పళ్ళెం మీద నర్తించడం అనివార్యం / అనారోగ్యమా / అష్టకష్టాలా! అవి మామూలేగా / పుట్టిన రోజా / అది పాతదేగా"**. అంటూ మరో రూపంలో వర్ణిస్తారు.

***

చివరగా, చలం మాటల్లోనే – కవి చెప్పేది నీకు పూర్తి అనుభవంలో ఉంటే ఆ కవిత్వం నీకు అనవసరం. కవిత్వం చదివిన తర్వాత కూడా నీ అనుభానికి విషయం ఏ మాత్రం అందకపోతే ఆ కవిత్వం నీకు వృథా. నీకు తోచనిదీ, కనపడనిదీ కవి చెప్పిన తరువాత నీ అనుభవంలోకి ఎంతో కొంత వచ్చేదీ – అదే నీకు సరిపడే కవిత. నిజంగానే మనకు తోచనిదీ, కనపడనిదీ కవి చెప్పిన తరువాత ఎంతో కొంత మన అనుభవంలోకి వచ్చేదీ ఇందులో ఎంతో ఉంది. అందుకే ఇది మనందరికీ సరిపడే కవిత్వం.


* **తేది : 1, జూన్, 2014న "ఆదిత్య డిగ్రీ కళాశాల" రాజమండ్రిలో డా॥ బండి సత్యనారాయణ కవితా సంపుటి "వాన కురిసిన రాత్రి" ఆవిష్కరణ సభలో సమీక్ష.**
* **పై వ్యాసం డిసెంబర్ 2014 "మల్లెపందిరి" సాహిత్య పత్రికలో ప్రచురితమైంది.**




# 9 సాన్నిహిత్య లేఖనం - సాహిత్యోల్లేఖనం . . .

సాహిత్య సేవాంకితుల కదలికలు, పరిశోధనాంశాలు, జీవిత విశేషాలు అవి ఏ స్థాయిలో ఉన్నా వాటిని భద్రపరచుకోవడం భాషాభిమానుల సమిష్టి బాధ్యత. రచయితల ఉత్తరాలు కేవలం 'ఉభయ కుశలోపరి'కి పరిమితం కాకుండా అవి విశ్వ సాహిత్యంలో అంతర్భాగం అనే భావనతో సమున్నత సాహితీమూర్తి ఆరుద్ర 25-11-1981 నుండి 09-08-1997 మధ్య కాలంలో వారి స్నేహితులు, పరిశోధనకు సహాయకారి అయిన శ్రీ సన్నిధానం నరసింహ శర్మగారికి రాసిన లేఖలను ప్రకాశమానం చేసే బాధ్యతను అందిపుచ్చుకుని తద్వారా వారి మనోగతాన్ని పరిశోధకులకు తెలియజేసేందుకు ఆరుద్ర దంపతులకు అత్యంత ఆప్తురాలైన డా. భారత లక్ష్మి సంపాదకీయం వహించి ప్రచురించినవే "ఆరుద్ర లేఖలు".

***

'ఆరుద్ర లేఖా సంపుటి – ఒక ప్రశంస శీర్షికతో ప్రసిద్ధ కవి, విమర్శకులు డా. అద్దేపల్లి ఈ గ్రంథానికి రాసిన ముందుమాటలో "సృజన విషయంలోనే కాక, అనేక కళా విజ్ఞాన శాఖల్లో తలస్పర్శి పాండిత్యంతో సాధికారిక నిర్ణయాలతో ఆయా శాఖల నిష్ణాతులతో కూడా గౌరవాలు పొందినవారుగా ఆరుద్రను కొనియాడుతారు. అందుకు ఉదాహరణలుగా కొన్ని అంశాలను పరిశీలిద్దాం.

ఒక లేఖలో తాను తంజావూరు, మేలటూరు, శాలియమంగళం వంటి ప్రదేశాలలో భాగవత మేళా నాట్య, నాటకాలపై పరిశోధనలు చేసి, ప్రదర్శనలు చూసి, రికార్డింగులు చేసి వచ్చినట్లు తెలియజేస్తారు. కేవలం సమాచారమే కాకుండా, లేఖా రచనలో, వాక్య నిర్మాణంలో ప్రత్యేకత కనిపిస్తుంది. మరో లేఖలో, కేంద్ర సంగీత నాటక అకాడమీ వారికి ఇంగ్లీషులో భాగవత సంప్రదాయ మేళా మీద ఒక పుస్తకం వ్రాస్తున్నట్లు అందులో నారాయణతీర్థుల వారి మీద నరసింహ దేవతారాధన మీద రెండు ప్రకరణాల రచన చేపట్టినట్టు తెలియజేస్తారు.

***

సాహిత్య పరిశోధన, అవసరమైన ఆకారాల అన్వేషణ మాత్రమే కాక, ఎన్నో వ్యక్తిగత అంశాలనూ శ్రీ సన్నిధానంతో చర్చించారు ఆరుద్ర. 'అకాడమీ జనరల్ కౌన్సిల్ ఎన్నికలలో మిత్రుల ప్రోద్భలంవల్ల నిలబడ్డాను. అందరూ కలిసి గెలిపిస్తే సంతోషం. లేదా నా సాహిత్య కృషి నా మానాన చేసుకుంటూ పోతాను" అంటారు 1984 జనవరిలో రాసిన ఒక లేఖలో; అలాగే 1985లో వారి మూడవ అమ్మాయి పెళ్ళి నిశ్చయం కావడం, వ్యవధిలేని పని ఒత్తిడిలోనూ ముందుగా మాట ఇచ్చాను కాబట్టి రాజమండ్రి సభలో మాట్లాడతాననడం; మరి కొన్నిచోట్ల వారి ఆరోగ్య విషయాలు..... ఇలా సాహిత్య గ్రంథాలలో మనకు దొరకని విషయాలను తెలుసు కోవడానికి ఈ లేఖలు మనకు ఆస్కారం కల్పిస్తాయి.

***

ముద్దు నరసింహంగారి 'హిత సూచని' తెలుగులో ప్రథమ వ్యాససంపుటంగా పరిగణింపబడింది. ఇందులో వ్యాసాలు 'ప్రమేయాలు' అనే పేరుతో ఉంటాయి. ఆ వ్యాస పునర్ముద్రణను అనేక వ్యయప్రయాలకోర్చి "గౌతమీ గ్రంథాలయం" అధికారుల పూనికతో పూర్తి చేస్తారు శ్రీ నరసింహశర్మ. అందుకు వీరిని అభినందిస్తూ "హిత సూచని మళ్ళీ ముద్రిస్తున్నందుకు దేశం మీకు ఋణపడి వుంటుంది. నేను తప్పకుండా పరిచయ వాక్యాలో, వ్యాసమో రాస్తాను" అని ఒక లేఖలో; ఆ గ్రంథం పీఠిక పని జరుగుతోంది అని మరొక లేఖలో, ముద్దు నరసింహం గారి వివరాలు 'కన్నెమరా లైబ్రరీ'లో పరిశీలించినట్లు వేరొక లేఖలో ఆరుద్ర వ్రాస్తారు. చాలా సందర్భాలలో శ్రీ సన్నిధానం వారికి ప్రశంసలు, ధన్యవాదాలు తెలియజేస్తారు ఆరుద్ర. అభినందన కేవలం వాక్యంగా కాకుండా అందులో కొంత చమత్కారం కనిపిస్తుంది. "ఆ ప్రతులు నా దగ్గర లేవు. మీ దయవల్ల ఇప్పుడున్నాయి; నమస్కరించి చెప్పుకునే క్షమాపణలు; మీరెంతో ఆదరాభిమానాలతో నా పరిశోధన మీ స్వకార్యంగా భావించి పంపుతున్న జెరాక్స్ నకళ్ళకు కృతజ్ఞతలు" లాంటివి వాటిలో కొన్ని.

***

అమెరికాలో తెలుగువాళ్ళ జీవితాలను బాగా పరిశీలించి; వాళ్ళ మంచి చెడ్డలు, ఆశలు, ఆకాంక్షలు, సమస్యలు, ఈతి బాధలు, ఆతిథ్యం, పండుగలు,



వీటన్నిటినీ వివరిస్తూ "ఇక్కడయినా, అక్కడయినా పండుగలు, పబ్బాలు, ఋతువులను బట్టి జరుపుకుంటారు. ఉత్పాదక శక్తులను పెంచడానికి తంతు జరుపుతారు. సామాజిక ఆర్థిక విధానాలు ఆదిలో మన కర్మకాండలను నిర్ణయించాయి. మార్క్సిజం చదువుకుంటే అన్నిటిపట్లా అవగాహన పెరుగుతుంది" అని తన అభిప్రాయాలను తెలియజేస్తూనే సూచనలనూ అందజేస్తారు. అలాగే, వారు దేశాంతరంలో ఉండగా కోల్పోయిన స్నేహ సంపదను (కీర్తిశేషులైన వారి సాహితీ మిత్రులను) గుర్తుచేసుకుంటూ వారితో గల మైత్రీబంధాన్ని పేరుపేరునా తలచు కుంటారు. విస్తృతమైన ఈ లేఖలో వారి రచనారంభదశలో కలం పేర్లన్నిటినీ తెలియజేస్తూ – "ఆనంద వాణి"లో – సినా మూర్తి, స్రుూ మొదలైన పేర్లు వాడుకునే వాడిని; 'తెలుగు స్వతంత్ర'లో కూడా జూనియర్ అశ్విని, సామిధేని సావిత్రి దేవి మొదలైన పేర్లు నావే – అని తెలియజేస్తారు.

***

ఈ లేఖలలో ఆనాటి సాహిత్యకారులు, పోషకులను ఆరుద్ర పేర్కొనడం, వారిని గురించిన ప్రాథమిక పరిచయాన్ని శ్రీ సన్నిధానం పాద సూచికలలో పేర్కొనడం జరిగింది. వారిలో, 'ఆంధ్రకేసరి యువజన సమితి' స్థాపకులు శ్రీ యాతగిరి శ్రీరామ నరసింహారావు (వీరు నరసింహావలోకనం పేరిట స్వీయచరిత్ర రాసుకున్నారు) ; గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయానికి గెజిటెడ్ లైబ్రేరియన్‌గా ఎన్నో సేవలు చేసిన శ్రీ రేటూరి గిరిధరరావు; 'వెలుతురు పిట్టలు', 'అక్షరంలో అంతరిక్షం', 'వామన విశ్వం' సంపుటాలను వెలువరించిన శ్రీ కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ, ప్రసిద్ధ పండితులు శ్రీ మల్లంపల్లి శరభయ్య గారు – వీరందరినీ మనమూ ఒకసారి స్మరించుకోవచ్చు.

ఇక, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు మరణించినపుడు – 'అంతటి సౌజన్య మూర్తిని, అంతటి విస్తృత కీర్తిని, అమిత సాహిత్య శక్తిని మళ్ళీ చూడడానికి రాజమహేంద్రి, ఆ మాట కొస్తే ఆంధ్ర సారస్వత లోకం, కొన్ని జీవిత కాలాలు వేచి ఉండాలి" అని కీర్తిస్తారు – ఆరుద్ర. మరో లేఖలో, కవికొండలవారి మీద శ్రీ శ్రీ ప్రభావం లేదు సరికదా, శ్రీ శ్రీ మీదే ఆయన Influence గాఢంగా ఉందని శ్రీ శ్రీ యే స్వయంగా 'అనంతం'లో "చింతా దీక్షితులు, కవి కొండల, బసవరాజు తన కవితాగురువులని" ప్రకటించారని తెలియజేస్తారు.

***

ఆరుద్ర సాహిత్య పక్షోత్సవాలు ఉభయ గోదావరి జిల్లాల్లో 1994 ఆగష్టు 16 నుండి 31 వరకు జరిగాయి. చివరి మూడురోజులు ఆ సభల్లో ఆరుద్ర పాల్గొని ప్రసంగించారు. ఈ విషయమై వారి సంతోషాన్ని లేఖలో వ్యక్తం చెయ్యడం; మరో సందర్భంలో 'శ్రీ శ్రీ నామ నవమి' మొదటిసారి జరిపిన ఘనత రాజమహేంద్రికి దక్కినందుకు నిర్వాహకుల కృషిని ప్రశంసించడం; 'స్త్రీ కళా కల్లోలిని' అనే జియ్యరుసూరి రచనను 'ఆంధ్ర కేసరి యువజన సమితి' వారిచే పునర్ముద్రించే ఆలోచన కార్యరూపం దాల్చకపోవడం, అది ఇప్పటికయినా అచ్చుకావలసిన సాహిత్యావసరం; 'ఆంధ్రలో అరుణోదయం' అనే పుస్తకం వ్రాయాలనే ఆరుద్ర సంకల్పం, ప్రాథమిక పరిశోధనలు ప్రారంభమయినా అది ఫలవంతం కాకపోవడం – ఇవన్నీ లేఖలు, పాదసూచికలలో, సన్నిధానం వారి అభిప్రాయాలలో మనకు తెలుస్తాయి.

***

సన్నిధానం నరసింహమూర్తి "బ్రౌన్ ఉదాహరణ కావ్యం" అంకితమిస్తూ ఆరుద్ర పై వ్రాసిన పద్యాలను గ్రంథం చివరలో ప్రచురించారు. అందులో శ్రీ శర్మ 'ఆరుద్రాంజలి' పేరిట – **"అడుగిడినట్టి ప్రక్రియల నద్భుతముల్ పొనరించె లోతులన్ / తడవి శ్రమించి ఆధునిక తత్త్వముతో రచియించె నెంతయో"** అని ప్రశంసిస్తూ; **బ్రౌన్ కెట్టుల ఋణముల బాపుకొనుట? / తీర్చగా లేని దది గణుతించ తరమె?/** అంతవరకెందు కారుద్రకైన జాతి / ఎంత ఋణపడె తీర్చుట కెట్లు కుదురు? అంటూ ఆంధ్రజాతి ఆరుద్ర సాహితీ సేవకు ఋణం తీర్చుకోలేదని శ్లాఘిస్తూ వీరి సేవలను బ్రౌన్ సేవలతో సరిపోల్చుతారు.

***

ఇరువురి సాన్నిహిత్యాన్నే కాక, అంతర్లీనంగా గల సాహిత్యాంశాలనూ దృగ్గోచరం చేసి డా. భారత లక్ష్మి కృషి అభినందనీయం.

*** ఫిబ్రవరి - 2015 "మల్లె పందిరి" లో ప్రచురితం.**



# 10 సామాజికత, వైజ్ఞానికతల కలనేత "పుడమితల్లి పులకించింది"

**"కొండవాగు నీళ్ళ నుండి కోక్, పెప్సీలకు;**
**జంతు చర్మాల నుండి జీన్స్ ఫ్యాషన్స్‌కు;**
**చెట్ల తొర్రల నుండి చందమామకు;**
**పచ్చిమాంసం నుండి పిజ్జాలకు"** మానవ జీవనం పురోగమనాన్ని, వికాసాన్ని సాధించిందంటే అందుకు ఎందరో మహనీయుల నిత్య సాధన, శోధనలే కారణం.

అయితే, జీవితాన్ని సుఖమయం చేయడానికి ఉద్దేశింపబడిన ఈ వైజ్ఞానిక ఆవిష్కరణలు ప్రాణి కోటి మనుగడకి చేటు చేస్తున్నాయని, పర్యావరణ సమతుల్యాన్ని హరిస్తున్నాయని మనందరికీ తెలిసినా, ఆలోచించేంత అవకాశం లేక అలా ఒకింత అవకాశం ఉన్నప్పుడు మాత్రం కాస్త ఆవేదన చెందుతుంటాం. ఒకనాటి స్వచ్ఛమైన గాలిని, నీటిని, సహజ శోభతో అలరారిన గ్రామీణ వాతావరణాన్ని తలుచుకుని సంబరపడిపోతూ 'మన మిగిలిన జీవిత కాలంలో ఉపద్రవాలేవీ ఉండవులే" అనే ధీమాతో రాజీ పడుతూ వర్తమానంలో బ్రతికేస్తుంటాం.

అయితే, అలా రాజీపడకుండా, గతకాలపు నెమరువేతతో తృప్తి చెందకుండా, భవిష్యత్ తరాల బాగుకోసం, ఈనాటి సమస్య; మూలాలు; ఇలాగే కొనసాగితే ఫలితాలు; అందుబాటులో ఉన్న ఒకటి, రెండు నివారణా మార్గాలు, ఉపేక్షిస్తే పర్యవసానాలు – వీటన్నిటినీ అన్వేషించి, విజ్ఞానశాస్త్రంలో అసాధ్యాలన్నిటికీ ఎప్పటికైనా ఆస్కారం ఉందనే ఆశావహ దృక్పథంతో ఒక ఊహాత్మక నివారణా మార్గాన్ని ఎంచుకొని; తన భావనలన్నిటినీ అక్షరాలుగా మార్చి ఆ అక్షరాలను పుస్తకంగా కూర్చితే అతడిని 'ఆచంట సాయికుమార్' అంటాం.

ఈ రచన ద్వారా తన లక్ష్యం సమాధానం లేని ఒక ప్రశ్నను పాఠకుడిపై సంధించడమే. అది "ఈ విశాల సృష్టిలోని అనంత జీవకోటిలో నీవు ఒక జాతికి

ప్రతినిధివి మాత్రమే. మరి, మిగిలిన జీవరాశి ఉనికికి హాని కలిగించే హక్కు నీకెవరిచ్చారు?" అని. ఈ ప్రశ్నను ఎక్కుపెట్టడానికి ఒక అందమైన కథనల్లి అందులో తాను చిన్ననాడు చూసిన పల్లె, పరిశీలించిన పక్షులు, పరికించిన చెట్లు; వేసవి సెలవులు గడిపిన తీరు, ఇళ్ళు, పెళ్ళిళ్ళు ఇవన్నీ మన కళ్ళముందు నడిచిపోతున్నట్లుగా దృశ్యమానం చేస్తారు. ఇదంతా ఏవో జాబితాలను తయారుచేసినట్లు, సమాచారంగా కాకుండా; ఆ ప్రాకృతిక సౌందర్యాన్ని మేము ఆనందించగలిగామనే గర్వాన్ని అయిదు పదుల వయసు దాటిన వారికి, కొంతైనా పొందగలిగామనే తృప్తిని మా తరాలకు, అరే! ఇదంతా కోల్పోయామే! అనే కొరతను భావి తరాలకు కలిగించేటట్లు, హృదయాలను కదిలించేటట్లు ఆవిష్కరిస్తారు.

జనాభా సమస్యను కేంద్రంగా చేసుకుని దానితో ప్రత్యక్షంగా, పరోక్షంగా ముడిపడి ఉన్న ఏ అంశాన్ని వారు విడిచిపెట్టలేదు. నేటి మన కాలుష్యపు జీవితాలు, ప్రయాణాలకు Reservation దొరకకపోవడం; హోటళ్ళలో మనుషులపై నుండి ప్లేట్లు అందుకోవడం; పట్టణాలకు వలసలు, గ్రామీణ వెనుకబాటుతనం; గనుల తవ్వకాలు; వివిధ కాలుష్యాలు; పల్లెల్లో కూడా ప్లాస్టిక్ సంస్కృతి; దోమలు; సిమెంట్ రోడ్ల నిర్మాణం వలన నేల నీటిని పీల్చుకోకపోవటం; తగ్గుతున్న అంతర్గత జలప్రవాహాలు; సెల్ మనిషి శరీరంలో అంతర్భాగం కావడం; పాలకొరత; పశువులకు ఇంజక్షన్ ఇచ్చి పాలను పిండడం; యాంత్రికీకరణ; ఇలా అనేకానేక అంశాలను కథానుగుణంగా స్పృశిస్తూ తిరిగి వీటన్నిటినీ ప్రధానాంశమైన జనాభా సమస్యతో సంధానపరచి; అంతలోనే అటు కురుక్షేత్ర సంగ్రామంలో పాల్గొనిన వివిధ దళాల Statistics ను; ఇటు పశ్చిమకనుమలలో జీవవైవిధ్యంపై 'మాధవ్ గాడ్గిల్' సిఫార్సులు; ప్రపంచ పర్యావరణ సదస్సులలో చర్చించిన అంశాలు, ఆమ్ల వర్షాలు, హరితగృహ ప్రభావం వీటన్నిటి మధ్యలో మనలను ఊపిరి తీసుకోనీకుండా ఉక్కిరి బిక్కిరి చేసి తన బహుముఖీన ప్రజ్ఞకు ఆశ్చర్యపోయేలా చేస్తారు. నాటి, నేటి స్థితుల అంతరాన్ని ఒకే తెరపై Vertical గా గీత గీసి రెండువైపులా చూపిస్తారు.

ప్రస్తుత స్థితి పట్ల రచయిత ఆవేదన పరాకాష్టకు చేరినపుడు "ఈ సమాజం బాగుపడడానికి ఒక ప్రళయమే రావలసి వస్తే ఆ మహా ప్రళయాన్ని ఇప్పుడే



ఆహ్వానిస్తాను" అన్న ఒక పర్యావరణ శాస్త్రజ్ఞుని మాటలను గుర్తు చేసుకుంటారు. సమస్య పరిష్కరణకు తనదైన ఒక మార్గాన్ని సూచించి మన చేత ఔననిపిస్తారు. ఒకనాటి సహజత్వానికి చేరువగా ఉన్న సమాజాన్ని తిరిగి స్థాపిస్తూ "మానవ ఆవాస వికేంద్రీకరణ జరిగినపుడే అన్ని సమస్యలూ పరిష్కారమవుతాయి'' అని సిద్ధాంతీకరిస్తారు.

ఇలా కేవలం రచన గురించి మాత్రమే విశ్లేషణ చేసి ముందుమాటలో డా.అద్దేపల్లి పేర్కొన్న మూడు వాక్యాలు మరిచిపోతే సమీక్ష అసంపూర్ణమవుతుంది. వారి మాట్లోనే :

1) కథా లక్షణాన్ని, సమాజ విశ్లేషణ ప్రాధాన్యాన్ని, ప్రబోధ సామర్థ్యాన్ని, శాస్త్రీయ సత్య ఆవిష్కరణనీ, అన్నిటినీ కొంత కొంతగా ఇముడ్చుకుని ఒక ఊహాస్వర్గాన్ని సాక్షాత్కరింపచేసి "అలా అయితే ఎంత బాగుండును?" అనే ఉత్కంఠను కలిగించి, అంతిమంగా పాఠకులను ఒక మంచి ఆదర్శం వైపు నడిపించే లక్ష్యం కలిగిన రచన ఇది.

2) జీవవైవిధ్యం నిలబడితేనే ఈ లోకం నిరంతర వారసత్వాన్ని నిలుపుకుంటుంది.

3) ఊహా కల్పన సామాజిక శిల్పంగా వినియోగించుకోవడం – ఈ రచన గొప్పతనం.

మనందరి లక్ష్యం మన వంశాన్ని, ఇంటిపేరుని నిలిపే సత్సంతానాన్ని ఈ సమాజానికి అందజేయడం. అయితే లోకమంటే మనిషి మాత్రమే కాదు. లోకం వారసత్వాన్ని నిలుపుకోవడమంటే కోటానుకోట్ల జీవరాశి తన వారసత్వాన్ని నిలుపుకోవడమే. అలా జరిగిననాడు జీవ వైవిధ్యం నిరంతరాయంగా కొనసాగుతుంది.

రచన ఏదైనా ఒక ఊహాత్మక ప్రక్రియే. అయితే, ఆ ఊహ ఒక సామాజిక సమస్యను కేంద్రీకృతం చేసుకుని ఆవశ్యకమైన సందేశాన్ని అందజేసినపుడు అది సార్థకతను పొందుతుంది. అలా సార్థకత పొందిన ప్రయత్నం శ్రీ సాయి కుమార్ "పుడమి తల్లి పులకించింది".

ఇక, సూచన చేయవలసివస్తే, సమస్యపట్ల, చెప్పదలచుకున్న విషయంపట్ల రచయితకు గల ప్రగాఢమైన ఆవేదన రచన విస్తృతిని పెంచి, కొంత పునరుక్తి (Repetition) కి కారణమైంది. పాత్ర ద్వారా కథ చెప్పించే క్రమంలో వర్తమానం నుండి గతానికి మరలా వర్తమానానికి చేసే ప్రయాణంలో పాఠకుడిని కొంత Confusion కి గురిచేసినట్లుంది.

వాస్తవికతకు దగ్గరగా ఉన్న భావనలను ఉన్నతమైన పాత్రలతో, సరళమైన భాషతో పలికించడం ద్వారా ఎంచుకున్న ఇతి వృత్తాన్ని పాఠకుడికి చేరవేయడం నవల ప్రధాన లక్షణం. ఈ క్రమంలో రచయిత ఎంచుకున్న ఊహాత్మక పదార్థం (Imaginative Content) భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలలో ప్రయాణిస్తూ (Time Travelling) పాఠకుని ముందు ఒక సమాంతర ప్రపంచాన్ని సృష్టించడం, వీటన్నిటి ద్వారా 'అస్తిత్వాన్ని నిలపుకోవాలని, సహజ మానవీయ ప్రవృత్తిని, నైతికతను విడనాడరాదని; తద్వారా ఉన్నత సాంఘిక నిర్మాణానికి కృషి చేయాలనే తాత్త్విక భావనలను పాదుకొల్పటం" – ఇవన్నీ ఆ నవలను Scientific Fiction వర్గీకరణలోనికి చేరుస్తాయి.

పై Parameters ఆధారంగా మూల్యాంకనం చేసినపుడు శ్రీ సాయి కుమార్ ప్రయత్నం, వారి నవల ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణత సాధించాయ్. అందుకే, ఈ పుస్తకం మనలో అనేక వైజ్ఞానిక అంశాలపట్ల లోతైన అవగాహనకు తెరతీస్తుందన్నది నిర్వివాదాంశం.

* **తేది : 24 డిసెంబర్, 2013న శ్రీ ఆచంట సత్య సాయికుమార్ సైన్స్ ఫిక్షన్ నవల "పుడమితల్లి పులకించింది" ఆవిష్కరణ సభలో సమీక్ష.**
* **జూలై & ఆగష్టు 2014 "మల్లె పందిరి" సాహిత్య పత్రికలో ప్రచురితం.**



# 11 కరుణశ్రీ సాహిత్యం - యువతకు సందేశం

"అస్పృష్టములు, అనాఘ్రాతములు అయిన కుసుమాలను మాత్రమే భగవన్నివేదన చేస్తాం, వాడిపోయినవి కాదు. అలాగే శారీరక ధృడత్వము, మానసిక నిర్మలత్వము గల యువతీ యువకులు మాత్రమే సమాజ నిర్మాణానికి కటిబద్ధులు కావాలని" స్వామి వివేకానంద పిలుపునిచ్చారు. ఈ శారీరక ధృడత్వము, మానసిక నిర్మలత్వములతో పాటు ఆవశ్యకమైన కొన్ని ఉన్నత లక్షణాలనూ యువత అలవరచు కోగలిగినవాడు వివేకుని స్వప్నం సాకారమవుతుంది.

అలాంటి లక్షణ సుగంధాన్ని తన పద్యాలలో పరిమళింపచేస్తూ యువతకు చక్కని మార్గదర్శకత్వాన్ని అందించారు కరుణశ్రీ. వాటిలో కొన్నిటిని పరిశీలిద్దాం.

నాగరికత పేరిట విదేశీ వ్యామోహంలో ఈ దేశం యొక్క ఔన్నత్యాన్ని విస్మరిస్తున్న వారికి – సహృదయత, దాతృత్వములు కలబోతగాగల భారతజాతి పరంపరను వివరిస్తూ మాతృభూమి పట్ల అవ్యాజమైన ప్రేమను ప్రకటిస్తారీ క్రింది పద్యంలో :

**'స్వచ్ఛంద జాతి' :**

**అచ్చపు చీకటిండ్ల బొరలాడుచునుండ ప్రపంచమెల్ల; నీ**
**పచ్చని తల్లి గుమ్మములపై వెలిగెన్ మణిదీపికల్ !! కనన్**
**వచ్చిన ఖండఖండములవారికి కోరిక దీరునట్లుగా**
**బిచ్చముపెట్టె 'భారతసవిత్రి' ప్రియంబున రెండుచేతులన్ !!!** అంటూ

భిక్ష పెట్టడములో "కోరిక తీరునట్లుగా" అనడంలో పరిమితి లేని దయాగుణ సంపదను తెలియజేస్తారు. "లోకమంత చీకటిలో తల్లడిల్లుతున్నప్పుడు, నాగరికత లేని నరులు పామరులై ఉన్నప్పుడు – వేదాలను వెలికితెచ్చి జ్ఞానభిక్ష పెట్టినావు –

నిజముగ నువు జగద్గురువువే' వంటి ఎన్నో దేశభక్తి గీతాలకు పై పద్యం ప్రేరణగా నిలిచిందనుటలో అతిశయోక్తి లేదు.

తరువాత పద్యంలో

**చచ్చినజాతి కాదు; మరిచావదు వేయియుగాలకైన, వె**
**న్నిచ్చినజాతి కాదు; పరువెత్తు విరోధిని బిల్చి కౌగిటన్**
**గ్రుచ్చినజాతిరా యిది! మరుత్తరుశాఖలతోడ హాయిగా**
**'అచ్చనకాయ' లాడుకొనెరా! మన కీర్తి లతామతల్లికల్!!** అంటూ మనదేశ 'అ'మృతత్వాన్ని హృదయానికి హత్తుకునేట్లు; మాతృభూమి పట్ల మమకార బీజాలు మస్తిష్కపు క్షేత్రంలో విత్తుకునేట్లు చేసారు.

ఈనాడు విద్యార్హతలెన్ని ఉన్నా "భావ ప్రసార సామర్థ్యాలు" (Communication Skills) పేరిట యువతకు మాటతీరు కోసం ప్రత్యేక శిక్షణ అవసరమవుతోంది. ఉత్తమమైన 'మాట తీరు' ఉన్నత ఉద్యోగాలకు అర్హతగా నిలుస్తోంది. అటువంటి ప్రధాన మాధ్యమమైన మాట అత్యంత సహజంగా, సుందరంగా ఉండాలని ఉద్బోధిస్తూ,

**"రసమయి"లో**

**"కలువలు పూచినట్లు! చిరుగాలులు చల్లగ వీచినట్లు! తీ**
**వలు తల లూచినట్లు! పసిపాపలు చేతులు సాచినట్లు! క్రొ**
**వ్వలపులు లేచినట్లు! చెలువల్ చెలువమ్మగ చూచినట్లుగా**
**పలుకుట పూర్వపుణ్యపరిపాకముగాదె తలంచి చూడగన్"** అంటారు.

నిజంగా పై ఉదాహరణలో చెప్పినంత సౌకుమార్యంతో, సౌందర్యంతో సహజరీతిలో సంభాషణ సాగితే సమాజంలో నేడు తలెత్తుతున్న లక్షలాది సమస్యలు తమ రూపు కోల్పోతాయనడంలో సందేహం లేదు. ఇదే భావనతో మరో పద్యంలో:

**తెలుగు బాల :**

**కోకిలమ్మ చేసికొన్న పుణ్యంబేమి !**
**కాకి చేసికొన్న కర్మమేమి !**



**మధుర భాషణమున మర్యాద ప్రాప్తించు**
**లలిత సుగుణ జాల ! తెలుగు బాల !** అంటూ 'మధుర భాషణ'పు ప్రాముఖ్యతను వివరిస్తారు. బాల్యదశలోనే పసి హృదయాలలో ఈ నియమావళిని నిక్షిప్తం చేసేందుకు, వారి భావి జీవనమంతా సమాజోపయోగకరంగా సాగేలా చక్కని బాటలు వేసేందుకు అనేక కథలను అందంగా ఉదాహరిస్తూ, ఇటువంటి సందేశాత్మకమైన పద్యాలను "తెలుగుబాల"లో అందించారు.

యువతలో అభిలషణీయమైన మరో లక్షణం "దయాగుణం". 'ఉమర్ ఖయాం' అనువాదమైన 'అమర్ ఖయాం'లో ఒక సందర్భంలో కరుణశ్రీ అంటారు:

**అమర్ ఖయామ్ :**

**వేదము లప్పజెప్పిన – కవిత్వము గుప్పిన – తర్క శాస్త్ర సం**
**వాదము లందుకొన్న – ఉపవాసములున్న – ఖురాను విన్న – మ**
**క్కాదుల గన్న – నెమ్మది దయారస మన్నది సున్నయైనచో**
**నీ దరహాస చంద్రికలు నిండవు; పండవు వాని భాగ్యముల్ !**

నిజమైన భాగ్యము – భగవత్ దరహాస చంద్రికలు మనపై ప్రసరించడమే. అయితే, నీ మనస్సు దయారసంతో పరిపూరితం కానినాడు నీ సమస్త శాస్త్ర సంపద, వివేకము, విజ్ఞానము నీ గమ్యానికి చేర్చుటలో నిష్ఫలమవుతాయని సూచిస్తారు.

ఓ సంస్కృత శ్లోకం **"నిద్రాలస్యం దేహయత్నం కేశవిన్యాస మేవచ, ఆసక్తి మశనే వస్త్రే నాతిరిక్తం సమాచరేత్"** (ఆహార వస్త్రాదులలో – శరీర పోషణలో – తలదువ్వు కోవటంలో – ఎక్కువ ఆసక్తి ఉండకూడదు) అని చెబుతోంది. జ్ఞాన సముపార్జన ప్రధాన ధ్యేయంగా గల యువత ఈ దశలో అప్రధానమైన ఆడంబరాలకు దూరంగా ఉండాలి. అటువంటి నిరాడంబరత్వాన్ని వినాయకునికి ఆపాదిస్తారీ పద్యంలో...

**నమస్తే :**

**లడ్డూ జిలేబి హల్వాలె యక్కర లేదు**
**బియ్యపుంద్రాళ్ళకే చెయ్యిచాచు**

**వలిపంపు పట్టు దువ్వలువలే పనిలేదు**
**పసుపు గోచీకె సంబ్రాలు పడును**
**ముడుపు మూటల పెట్టుబడి పట్టుదల లేదు**
**పొట్టి గుంజిళ్ళకే పొంగిపోవు**
**కల్కితురాయిలకై తగాదా లేదు**
**గరిక పూజకె తలకాయ నొగ్గు**
**పంచ కళ్యాణి కై యల్కపాన్పు లేదు;**
**ఎలుక తత్తడికే భుజాలెగురవైచు**
**పంచ భక్ష్యాలకై మొండి పట్టులేదు;**
**పచ్చి వడపప్పె తిను "వట్టి పిచ్చి తండ్రి!".**

ఇలా, వినాయకుని పరిపూర్ణ నిరాంబరత్వానికి ప్రతినిధిగా పేర్కొంటారు.

నేటి యువత అసలైన ప్రేమకు అర్థం తెలియక, తమను నిరాకరించిన కారణంగా ఆత్మహత్య చేసుకోవడమో, అమ్మాయిలపై (యాసిడ్ దాడులు చేయడం వంటి) ఘాతుకాలకు పాల్పడటమో జరుగుతోంది. అయితే, **ప్రేమంటే – ప్రేయసి పట్ల, ఆమె సచ్ఛీలత పట్ల, ఆమె ఆధ్యాత్మికశక్తి పట్ల; ముఖ్యంగా ఆమె లేని తానూ జీవించలేనన్న తన అమలిన ప్రేమ పట్ల అంతులేని విశ్వాసం కల్గి ఉండటమే –** అని తెలిపే పద్యం "అమర్ ఖయాం"లో –

**"నీవొక వేళ ముందు మరణింతువ యేని – మధు ప్రపూర్ణమౌ**
**దేవుని తోటలో పడుచు తీవలు దిద్దిన పూలబాటలో**
**కోవెల ప్రక్కగా వకుళ కుంజము చాటున వేచియుందు; మిం**
**దీవర పత్ర నేత్ర ! అరుదెంతును నేనును రేపు మాపులో"** – అంటూ ప్రేయసిని మరణానంతరం దేవుని తోటలో, అందునా సుందర వనాలలో నివసించగల పుణ్యమూర్తిగా భావనచేస్తూ, ఆమె ఈ లోకం విడిచిన ఒకటి రెండు రోజులలోనే తానూ అక్కడకు చేరుకోగలననే విశ్వాసాన్ని ప్రదర్శిస్తాడు – ప్రియుడు.



ఇక, సరళ పదజాలంతో "తెలుగు బాల"లో

**"సాధు సంగమమున సామాన్యుడును గూడ**
**మంచి గుణములను గ్రహించుచుండు**
**పుష్ప సౌరభంబు పొందదా దారంబు**
**లలిత సుగుణజాల! తెలుగు బాల!"** అంటూ **"A man is known by the company he keeps"** అన్నట్లు సజ్జనసాంగత్యం యొక్క ఆవశ్యకతను తెలియజేసారు.

కరుణశ్రీ కవిత్వం నుండి యువత అనుసరించవలసిన మరో లక్షణం ప్రతి అంశం పట్ల సానుకూల దృక్పథాన్ని, ఉన్నత వైఖరులను అలవరచుకోవడం. సమాజం దృష్టిలో ఎటువంటి ప్రాధాన్యత లేని వ్యక్తిగా భావింపబడే పాకీపిల్లకు ఎంత ఔన్నత్యాన్ని ఆపాదించారో చూడండి;

**"చీపురు నొక్క చేత, ఒక చేతను చింపిరి గంపబూని, యీ**
**పాపపు గుప్ప లూడ్చెదవు బాలిక! చీదర లేదె సుంత? నీ**
**యోపిక చూచి మెచ్చి తలయూచు జగత్ప్రిత కన్నుగొల్కులన్**
**తేపకు, తేపకున్ బయలుదేరునవే నులి వెచ్చ బాష్పముల్!!"** అంటూ "పాకీదానిగ నాడిపోసికొను ఈ పాపిష్టి లోకమ్ము నీ బాకీ తీర్చుకొనంగ లేదు జగదాంబా! జన్మ జన్మాలకున్" అని పాపపు కుప్పలూడ్చు ఆమె ఓపికకు జాలిపడుతూ ఆమెను ఓ అనంత త్యాగమూర్తిగా అభివర్ణిస్తారు.

మరోచోట, కష్టనష్టాలెన్ని ఎదురైనా, 'నీతిని విస్మరించి చరించరాదని తెలియజేస్తూ;

**"నష్టమధికమైన, కష్టాలు కలిగిన,**
**సిరి తొలంగి చనిన, మరణమైన,**
**ధర్మ పథమొకింత తప్ప రుత్తమ జనుల్**
**లలిత సుగుణ జాల! తెలుగు బాల!"** అంటారు. ఇందులో 'మరణమైన' అనుట ఆ స్థితిలో సైతం ధర్మం విడిచి చరించరాదని పునరుద్ఘాటించినట్లుంటుంది.

వేరొక పద్యంలో 'వసుధైక కుటుంబకం' అనే భావనను సరళ రీతిలో

**"వీడు పరులవాడు; వాడు నా వాడని**
**అల్పబుద్ధి తలచు నాత్మయందు;**
**సాధు పుంగవులకు జగమే కుటుంబంబు**
**లలిత సుగుణ జాల! తెలుగు బాల!"** అంటూ తెలియజేస్తూ, పక్షపాత వైఖరిని విడనాడి 'సమైక్యత, సమరసత' పాదుకొల్పాలని సూచిస్తారు.

ఈ విధంగా యువతకు అనుసరణీయమైన లక్షణాలన్నిటినీ అందమైన పద్యాలుగా అందించిన ఆ మహనీయుని సందేశ సర్వస్వం ప్రతి అడుగున మనకు ఆదర్శమైతే......

**తెలుగుతల్లి ఎన్నటికీ.... సాధుజన కల్పవల్లే.**

* **'సాహితీ మిత్రులు' మచిలీపట్నం ఆధ్వర్యంలో తేది : ఆగష్టు 4, 2009న జరిగిన సభలో ప్రసంగం.**
* **ప్రపంచ, తెలుగు మహాసభలు - 2012 సందర్భంగా కాకినాడలో జరిగిన తెలుగు మహాసభలలో తేది : 3 డిసెంబర్, 2012న ప్రసంగం.**
* **'ఋషి పీఠం" ఆధ్యాత్మిక పత్రిక విశిష్ట సంచిక - 2014లో ప్రచురితం.**



# 12 మనో వీథిలో హృదయ విహంగపు కువకువలు

బాహ్యంగా కనిపించే అంశాల పట్ల అవగాహన పెరిగిన తరువాత, క్రమంగా వాటిపై విముఖత మొదలై వ్యక్తిలో అంతర్వీక్షణ ఆరంభమవుతుంది. అప్పుడే తనదైన లక్ష్యం, అస్తిత్వం, సహజాతాలు – ఇలాంటి భావాలు స్ఫురణకు వస్తాయి. ఈ దశలో కవి అంతరంగంలో జనించిన ఆలోచనలకు అక్షరాలు తోడైనపుడు అది అందమైన, ఆలోచింపచేసే కవిత్వంగా రూపొందుతుంది. ఆ కవిత్వ రూపం ఏదయినేతేం? పద్యమైనా, గద్యమైనా; నానీలు, రెక్కలు వంటి లఘురూపాలయినా; లక్ష్యం – సమాజహితాన్ని కాంక్షిస్తూ పాఠకులను సమ్మోహితం చేయడమే.

'రెక్కలు' ప్రక్రియను గురించి ప్రసిద్ధ కవి, విమర్శకులు డా. అద్దేపల్లి రామమోహనరావు గారి విశ్లేషణను పరిశీలిస్తే **"ఈ రూపంలో ప్రతి కవితా ఒక విహంగం. దాని రెక్కలే చివరి 'రెండు పాదాలు'. రెక్కల వల్లనే పక్షి ఎగురుతుంది. కవితలోని చివరి రెండు పాదాల వల్లనే కవిత ఉదాత్తమవుతుంది. ఈ ఉదాత్తత అనేక కోణాల్లో ఆవిష్కృతమవుతుంది".**

ఈ ప్రక్రియకు ఆద్యులైన సుగమ్ బాబు మాటల్లో **"ఒకానొక సన్నివేశంలో నుంచి తలొంచి ప్రయాణించడం, అందులోని కష్టసుఖాలను అనుభవించడం, గ్రహించిన సత్యాన్ని రాగ ద్వేషాలకు అతీతంగా, నిరాడంబరంగా ఆవిష్కరించడం రెక్కలులోని తత్త్వం".**

"కువకువలు" రెక్కల సంపుటిలో అద్దేపల్లి పేర్కొన్న ఉదాత్తతను, సుగమ్ బాబు సూచించిన సత్యాన్వేషణను సమర్థవంతంగా నిర్వహించారు శ్రీ వరం.

తన '131' రెక్కల సంపుటిలో వారు ప్రధానంగా పదే, పదే చెప్పిన విషయం ఒక్కటే. అది "నీదైన అస్తిత్వాన్ని విడిచిపెట్టకు" అని. మొదటి రెక్కలోనే ఈ దిశలో కవి హృదయావిష్కరణ ఇలా సాగుతుంది – **"అక్కడ – కాలంతో మనస్సు / ఇక్కడ**

**భావంతో హృదయం / ఆత్మ / ఎక్కడ?"** మనస్సు కాలంతో పరుగులు తీస్తూనూ, హృదయం భావాలను సమీకరించడంలోనూ తీరిక లేకుండా నిమగ్నమైనపుడు ఆత్మ ఒంటరితనాన్ని అనుభవిస్తోంది. మరో కోణంలో ఆలోచిస్తే – వ్యక్తి, తన మనస్సుకు, హృదయానికి అధిక విలువనిస్తూ ఆత్మను విస్మరిస్తున్నాడనే ఆవేదన వ్యక్తమవుతుంది.

సహజత్వాన్ని విడనాడి కృతకంగా జీవిస్తున్నామని మరో విధంగా **"ఒకడు/ నువ్వు / రెండోవాడు / నువ్వే / రెండు ముఖాలు / రెండు నాలుకలు"** అంటారు.

"Once Upon a Time" లో
So I have learned many things, son.
I have learned to wear many faces
like dresses - home face,
office face, street face, host face,
cocktail face, with all their conforming smiles
like a fixed portrait smile అంటారు **Gabriel Okara.**

ఇలా మనం "పదిమందీ ఏమంటారోనని ఎదలో భావన దాచేస్తూ" సందర్భాన్ని బట్టి 'స్వ' రూపాన్ని మరుగుపరచి రూపాంతరతను ప్రదర్శిస్తూ బ్రతికేస్తున్నాం. అందుకే, **"పసివాడి / నిద్ర / పెదవులపై / నవ్వు / ఆ కల / నేను కనగలనా?"** అని కవి వాపోతాడు.

"నాలికపై స్తన్యపు తడి నడయాడే కాలంలో బడి ఇంకా 'నా', 'నీ'లను నేర్పని రోజులలో" మనమంతా అలా నిద్ర, మెలకువ – రెండు స్థితులలోనూ అచ్చంగా, స్వచ్ఛంగానే బ్రతికాం. ఇపుడు పతనపు పరాకాష్టకు చేరి మనలో మనలను వెతుక్కొనే దుస్థితిలో ఉన్నాం. ఉదాహరణగా –

**"నువ్వొక / అలవి / నేను నీ / నురుగు / ఇద్దరం వెతుకుదాం / సంద్రాన్ని"**– నిజానికి అల, ఆ అలల ఘర్షణ వలన జనించిన నురుగు రెండూ సముద్రపు అంశీభూతాలే. కానీ అవి తమ మూలమైన సముద్రపు చిరునామా మరచి తిరిగి అన్వేషించే స్థితికి చేరడం – పై ప్రతిపాదనకు నిదర్శనం.



మరోచోట – **"తలుపులు మూస్తే / ఎవ్వరూ రారు / తలుపు తెరిస్తే / అందరూ వస్తారు / తలపే / తలుపు"** ఈ వాక్యం గిరి గీసుకుని బ్రతుకుతున్న మన వ్యక్తి కేంద్రక జీవితాలకు అద్దం పడుతుంది. గది తలుపులు తెరిచినపుడే ఇతరులు ప్రవేశించగలరు. అలాగే మన మనసులను తెరచి ఉంచినపుడే కదా! భావాల వినిమయం సాధ్యమయ్యేది. "ఆనో భద్రాః క్రతవో యంతు విశ్వతః" – LET THE NOBLE THOUGHTS COME TO US FROM ALL SIDES" అని ఘోషించిన ఋగ్వేదస్ఫూర్తితో ఎల్లడలా జ్ఞానాన్వేషణ చేయాలంటారు కవి. ఒక వృత్తం అనేక బిందువులను చేర్చుకున్నపుడే దాని పరిధి విస్తృతమవుతుంది. అలాగే మది–గది తలుపులను తెరిచి ఇతరులను ఆహ్వానించినపుడు వ్యక్తిత్వ వికాసం సాధ్యమవుతుంది.

అయితే, ఈ క్రమంలో ఎవరితో కలుస్తున్నామో చూసుకోవాలి. **"జీవనది/ కడలిలోకి / ప్రేమతో / పరుగెత్తింది / తన రుచిని / కోల్పోయింది"** అంటారు వరం. అంటే, నీ పరిధిని పెంచుకునే క్రమంలో జరిపిన సంగమం నీదైన రుచి (అస్తిత్వం) నుండి నిన్ను దూరం చెయ్యకూడదు. ఈ సందర్భంలో "Never change your originality for the sake of others because, no one can play your role better than you" అనే Proverb జ్ఞప్తికి తెస్తారు.

ఒక నూతన సృష్టి వెనుక మనం పరిశీలనగా వెతికితే అనేక అంశాల సమాకలిత కృషి దాగి ఉంటుంది. ఈ భావనతో **"వాన / పలకరించింది / నేల / పులకరించింది / జీవం / విస్తరించింది" అంటూ జీవ విస్తరణ అనే ఫలితం వెనుక గల వాన, నేలల కృషిని; మరొక చోట "వసుధ / పిలిచింది / వాన / వచ్చింది / స్నేహాలకు / దూరాలు లేవు"** అంటూ ప్రాకృతిక సంఘటనలకు తన భావుకత్వాన్ని జోడించి ఒక కార్యకారణ సంబంధాన్ని ధ్వనింపజేస్తారు.

అనంతమయిన ఈ సాహితీ పయనంలో తనకు మార్గదర్శకత్వం వహిస్తున్న ముందుతరం సాహితీ మూర్తులను గుర్తు చేసుకుంటూ **"అక్షరం / దారి / అనంత/ పయనం / దోవనిండా / దీపాలే" అంటారు. అట్టివారిలో "వందల మంది కవుల్ని వెన్నెలతో సానపట్టిన సాహితీ జగత్ జాబిల్లి – అద్దేపల్లి"** అని తన గురుభక్తిని అక్షర బద్ధం చేస్తూ మరోచోట "నేర్వడమే జీవితం" అనే ప్రతిపాదనతో తన నిరాడంబరతనూ

ప్రకటిస్తారు. ఇలాగే, అజ్ఞానంపై సంధింపబడిన అస్త్రంగా పుస్తకాన్ని వర్ణిస్తూ – **"పుస్తకం / అక్షరాల / తూటాల / సంపుటం / గురి / అజ్ఞానం"** అనడం కవితాత్మకంగా ఉంటుంది.

సాధారణంగా పెద్ద గీతను చిన్నది చేయాలంటే దాని పక్కన మరొక పెద్ద గీతను గీయాలని సామెత. ఈ సూత్రాన్ని గాయానికి అన్వయిస్తూ చేసిన చమత్కృతి "గాయానికి మందు గాయమే". నిజమే! మరొక బాధ కలిగే దాకా మనం ప్రస్తుత గాయాన్ని పూర్తిగా మరువలేం. **"పొంగకు / కుంగకు / తడి నడకను/ ఆపకు / నువ్వొక / జీవనదివి"** అంటూ స్థితప్రజ్ఞతను ఉద్బోధిస్తారు. ఇందులో తడి నడక అనే ప్రయోగం ఈ రెక్కలకు మరింత అందాన్ని కూర్చుతుంది.

**"కాలం వినూత్న జీవన చిత్రాలు గీయాలంటే ఉద్యమ జ్వాలలే కుంచెలు"** అంటూ ప్రతీ నూతన సమాజ ఆవిర్భావం వెనుక ఒక ఉద్యమం ఉన్నదనే అంశాన్ని స్పష్టంగా తెలియజేస్తారు.

చివరగా **"కల్లలు / ఎల్లలు / దాటినా / మనవు (మనలేవు) / నిక్కముగా/ సత్యమే నిలుస్తుంది"** అని శ్రీ వరం ప్రతిపాదించినట్లు 'కువ కువల' పేరిట చేసిన ఈ సృజన సాహిత్య జగత్తులో కలకాలం నిలచిపోతుంది. కారణమేమంటే ఇందులో ఎల్లలు దాటిన కల్లలు వెతికినా కనపడవు. ప్రతి పుటలోనూ మనకు ఎదురయ్యేవి నిక్కముగా నిలిచే సత్యాలే. అందుకే, డా. అద్దేపల్లి దీవించినట్లు వీరు ఇంకా 'రెక్క' బలాన్ని పెంచుకుని ఉన్నతవీథీ సంచారం చెయ్యాలని మనమూ కోరుకుందాం.


✻ **తేది : 20, అక్టోబర్ 2013న విజయవాడ చంద్ర రాజేశ్వరరావు గ్రంథాలయంలో "రమ్యభారతి సాహిత్య వేదిక" ఆధ్వర్యంలో జరిగిన శ్రీ యెనుముల వేంకట రమణరావు (వరం) రెక్కల సంపుటి "కువకువలు" పరిచయ సభలో సమీక్ష.**

✻ **పై వ్యాసం ఏప్రిల్ 2015 "ప్రజా ప్రభాతం" పత్రికలో ప్రచురితమైనది.**




# 13 వెతలు కవితలుగా మారితే...

**"Poetry can be dangerous, especially beautiful poetry, because it gives the illusion of having had the experience without actually going through it" అంటాడు రూమి.** అంటే కవిత్వం మనం వాస్తవంగా పొందలేని రసానుభూతులను పరిచయమైన అంశాలుగా భ్రాంతికి గురి చేస్తుంది. నిజానికి ఇది కవిత్వానికి రూమి చేసిన నిందాస్తుతి.

అయితే, కేవలం ఊహాలోకాల్లో విహరింపచేయకుండా చుట్టూ ఉన్న సమాజాన్ని కొత్తగా చూపే ప్రయత్నం చేసేదీ అందమైన కవిత్వమే. అలాంటి ప్రమాద రహితమైన కవిత్వపు కోవలోనికి **డా॥ పుయ్యపు హనుమంతరావు** గారి సాహిత్యం చేరుతుంది.

వారి నాలుగు కవితా సంపుటాలనూ పరిశీలించినపుడు – వాస్తవానికి అతీతమైన ఊహలు, ప్రయోగాలు, క్లిష్టమైన శబ్దాలు, అస్పష్ట భావాలు ఇవేవీ కనపడవు. అందుకే **సమీక్షకుడు అవసరం లేని కవిత్వం వారిది.** ఏ పదమైతే నేరుగా పాఠకుడిని చేరగలదో అదే రాసారు. ఏదైతే వీరనుకున్నారో అదే పాఠకుడిని చేరుతుంది. ఇది సరైన భావ ప్రసార లక్షణం. అంటే **కవి హృదయం, పాఠక హృదయం అంటూ విడివిడిగా లేని అద్వైత స్థితి.**

1989లో ప్రచురితమైన వీరి మొదటి గ్రంథం **'సుధాంజలి'–** కుసుమాంజలి, గీతాంజలి, గేయాంజలి, ప్రేమాంజలి అనే నాలుగు భాగాల వర్గీకరణతో ఉంది. "లేవను వారికి లేనే లేవు. కలవను వారికి కొలువే నీవు" అంటూ ఒకింత ఆధ్యాత్మికత, "గడ్డిపువ్వులైనా, ముద్దబంతులైనా భూదేవి ఇచ్చిన వరాలు" వంటి ప్రాకృతిక ఆరాధన కనిపిస్తాయి. మరికొన్ని కవితలు, పాటలలో సమాజం పట్ల ఆవేదన; "వానకు తడియదు, ఎండకు ఎండదు, రాజు పేదల భేదము చూపదు, నిదుర మెలుకువల సంధి సమయమిది, నిరుపేదలకు కలలే పెన్నిధి' – అంటూ స్వప్నాలను కవిత్వీకరించే ప్రయత్నం కనిపిస్తాయి.

1991లో ప్రచురితమైన రెండవ పుస్తకం **"గీతాలహరి"** ముందు మాటలో సుప్రసిద్ధ కవి, విమర్శకులు ఇస్మాయిల్ – **కవిత్వం గురించి ప్లేటో అన్న మాటలను గుర్తు చేస్తూ "కవిత్వం ఒక పూనకం; కావ్య దేవత (Muse) కవిని పూనుతుంది. కవి పాఠకుడిని పూనుతాడు"** అంటారు. ఇక్కడ **పూనకమంటే ఒక తన్మయ స్థితిలో తాను పొందుతున్న అనుభూతిని ఏకాగ్రతతో అక్షరాలుగా తర్జుమా చేయడం** అని వీరి అభిప్రాయం కావచ్చు.

తాను ఏ ఉద్వేగానికి లోనైనా మరునిముషం సంబంధిత అంశంపై కవితా రచన చేయడం హనుమంతరావు గారి సహజాతం. అందుకే వీరి నుండి తప్పించుకున్న ప్రధాన చారిత్రిక అంశాలేవి కనపడవు. సమకాలీన అంశాలతో పాటు ఎందరో నాయకులు, మారణ హోమాలు, నూతన రాజ్యాల ఏర్పాట్లు, విభజనలు, నక్సలిజం, గిరిజన పోరాటాలు, రిజర్వేషన్స్, అస్పృశ్యత, రాజీవ్ మరణం, నాయుడు–ఎంకి, కమ్యూనిజం, సద్దాం–బుష్ .... ఇలా ఎన్నెన్నో విషయాలు వీరి కవితలలో ఒదిగిపోయాయి.

అందుకే **"విషయాన్ని సమగ్రంగా ఆలోచించడం; ప్రపంచ భిన్నత్వాన్ని కలిపి చూడడం, ఈ క్షణం ఉన్నచోట మరుక్షణం ఉండని ఉత్సాహం; అన్నిటికీ మించి ప్రతిక్షణం నుండి శక్తిని పిండడం, జీవిత భాండపు బహుముఖాల్నించీ ఏకకాలంలో ఆనందం జుర్రే ఆసక్తి"** వీరి లక్షణాలుగా ఇస్మాయిల్ పేర్కొని ప్రశంసించారు.

విద్య, వృత్తి పరంగా సమాజపు మొదటి వరుసలో గల హనుమంతరావుగారు కవిత్వం రాయకపోతే లోటు లేదు. కానీ కవిత్వం రాయనిదే జీవితోత్సవం ఉజ్జ్వలవంతం కాదు. అందుకే తన **జీవితోత్సవాన్ని ఉజ్జ్వలవంతం చేసుకునేందుకే వీరు సాహిత్య సృజన చేశారంటారు ఇస్మాయిల్.**

2007లో ప్రచురించిన **'ప్రకంపనలు'** కవితా సంపుటిలో "గులాబీ ముళ్ళతో పూచింది / కాపాడుకుందుకే కదూ / సమాజానికి చట్టాలు కాపలా / అవి నాయకులకు చుట్టాలౌతున్నై", "వేల ఎకరాల భూమితల్లి భారాన్ని / ఒక్క నాయకుడు ఎలా



మోస్తున్నాడో / లక్షల మంది భూమి లేని దీనులు / ఒక ఎకరాలో కూరుకుపోయారు" వంటి కవితలతో నేటి సామాజిక స్థితి, నాయకుల దౌష్ట్యాలపై వ్యంగ్యాస్త్రాలను సంధిస్తారు.

మరోచోట, "పాశ్చాత్య నాగరికత / మన గుమ్మంలో కొచ్చింది / పెద్దలను గుమ్మం దాటించింది / వృద్ధాశ్రమాలకు చేర్చింది" అంటూ పెద్దల రూపంలో ఉన్న దిక్సూచీలను మనం వృద్ధాశ్రమాలకు తరలిస్తున్నామని వాపోతూ దాని వెనుక మనం చూడలేని మూలాలను విశదీకరిస్తారు.

**"కేవలం వాస్తవికతను వివరించడమే కాకుండా పరిష్కారమైన సందేశాన్ని కూడా ఇవ్వటం హనుమంతరావు కవిత్వానికి ఒక విలువను తెస్తుంది. అందుకే, వీరిది – రాజకీయ చైతన్యం, స్వీయ పరిష్కార అన్వేషణ, సామాజిక బాధ్యత ముప్పేటగా అల్లుకున్న కవిత్వంగా వర్ణిస్తారు డా. అద్దేపల్లి.**

ఇక, 2013లో విడుదలైన **"సత్యాన్వేషణ"** అంతా సమస్యలమయం. అందుకే ముందు మాటలో శ్రీ హనుమంతరావు గారు ఇవి కవితలు కావు, సామాన్య ప్రజలు పడిన, పడుతున్న వెతలు అని ప్రకటించారు. "ఇసుక కాంట్రాక్ట్; న్యాయ వ్యవస్థ; యువతకు సందేశం; చదువు కొనటం; మహిళా రిజర్వేషన్ బిల్లు" వంటి అంశాలతో ముడిపడిన ఈ గ్రంథాన్ని ప్రత్యక్ష దైవమైన సూర్యునికి అంకితమిస్తూ సౌర శక్తిని వినియోగించుకోవాలని సూచన చేయడం ద్వారా కవిగా వీరి సామాజిక బాధ్యతనూ నిర్వర్తించినట్లయింది.

వీరి రెండవ పుస్తకంలో ఇస్మాయిల్ **"పదేళ్ళ క్రితం బెంగాలీ యువకులు కొంతమంది దోనెపై కలకత్తా నుండి మద్రాసుకు సముద్రయానానికి సాహసించారు. బయలుదేరిన వారం పది రోజులకు గోదావరీ ముఖద్వారం చేరేటప్పటికి ఋతు పవనాలు తిరుగుముఖం పట్టడంవల్ల వీళ్ళ యాత్ర ఆగిపోయింది. కందికుప్ప గ్రామ ప్రజలు ఎక్కడికి వెడుతున్నారని వీళ్ళని అడిగారు. మద్రాసు వెడుతున్నామని వీళ్ళన్నారు. జనం నవ్వి 'ఐతే, మెయిలెక్కండి. ఇదేం పిచ్చి పని!" అన్నారు. "మెయిలెక్కి మద్రాసు వెడితే, ఇక సాహసయాత్ర ఎక్కడిది? హనుమంతరావు మెయిలెక్క లేదు.**

**అందుకని ఆయన్ని అభినందిస్తున్నాను"** అంటూ చమత్కరిస్తారు. అంటే శ్రీ హనుమంతరావుగారు కవిత్వానికి అవసరమైన సరంజామాను పోగేసుకుని బలవంతంగా కవిత్వాన్ని తనలోంచి లాగే ప్రయత్నం చెయ్యలేదు. తన గుండె బావిలో ఊరిన భావనా జలాన్ని తోడి బయటకు తీసి పంచిపెట్టారంతే. ఈ క్రమంలో వారి అనుభూతుల ఆవిష్కరణకు పదాడంబరత అవరోధంగా భావించారు. అందుకే **"సారళ్యం" వీరి కవిత్వ చిరునామా అయింది.**

రామాయణం–సుందరకాండలో వాల్మీకి **"సంస్కారేణ యథాహీనం – వాచమ ర్థాంతరం గతమ్"** (వ్యుత్పత్తి, వ్యాకరణ, ఉచ్చారణాదుల అవగాహన లేనప్పుడు వాక్యము విపరీతార్థములను తెలుపుతుంది) అంటారు. అలాంటి విపరీతార్థాలకు తావు లేకుండా సమాజాన్ని, తన సందేశాన్ని అలతి అలతి పదాలతో అందంగా మన ముందుంచటం వీరి శైలి. అందుకే భాష తెలిసిన ప్రతి పాఠకుణ్ణీ కదిలించే కవి శ్రీ హనుమంతరావు గారు. **Words rich in meaning can be cheap in sound effects** అనే మాట వీరి విషయంలో అక్షర సత్యం.

సుదీర్ఘ కాలంగా వీరు చేసిన, చేస్తున్న శ్లాఘనీయమైన సాహిత్య కృషిని అభినందిస్తూ అది మరింతగా కొనసాగాలని ఆశిద్దాం.

❋ **తేది : 9 ఏప్రిల్ 2014న డా॥ వుయ్యపు హనుమంతరావు గారి వజ్రోత్సవ సభలో వారి నాలుగు కవితా సంపుటాలపై ప్రసంగం.**



# 14 మేఘ 'సందేశం'

'మేఘ సందేశం' కావ్యంలో మహాకవి కాళిదాసు రచనా వైదుష్యాన్ని, కావ్య నిర్మాణ మనోహరత్వాన్ని ఎందరో మహనీయులు అనేక పార్శ్వాలలో ఆవిష్కరించినా, అధిక వ్యాసాలలో ఆలంకారికత ప్రధాన కేంద్రమైంది. కొందరు పరిశోధకులు ఈ కావ్య రచన జరిగిన కాలాన దేశ సామాజిక, మత స్థితిగతులు; ఇంకొందరు రామాయణం వంటి సందేశ వాక్యాలు, ఇతిహాసాలతో ఈ కావ్యానికి గల సారూప్యత వివరిస్తే, ఈ కావ్యంలో ఉపయోగించిన మందాక్రాంత వృత్త స్వరూప స్వభావాలు, ఇతర కావ్యాలలో వాటి ఉనికి; భౌగోళికంగా మేఘ గమనాన్ని Maps సహాయంతో వివరణ – ఈ కోణంలో మరికొన్ని పరిశోధనలు సాగాయి. ఓ సమగ్ర అవగాహన ఏర్పడి కావ్యాన్ని అవగతం చేసుకోవడానికి ఈ వ్యాసాలన్నీ మనకు దోహదపడతాయి. అలాగే, శ్లోకాల సంఖ్య, ముఖ్యంగా కావ్యాంతాన్ని నిర్ధారించే ఆఖరి శ్లోకం విషయంలో కోలాచల మల్లినాథ సూరి సంస్కృత వ్యాఖ్యానంతో ఉన్న వావిళ్ళ వారి పుస్తకం, సుశీలకుమార దేవుని ప్రతిపాదనలు, ఈ రెండింటి మధ్య గల వైరుధ్యం – ఈ విషయంపైనా, అనేక చర్చోపచర్చలు జరిగాయ్. అసలు కాళిదాసు విక్రమార్కుని కొలువులోని నవరత్నాలలో ఒకరా? లేక భోజుని ఆస్థానంలోని వారా? అనేది చారిత్రక పరిశోధనాంశమయింది.

అయితే, తన క్షేమ సమాచారాన్ని మేఘుని ద్వారా సందేశంగా భార్యకు పంపదలచిన యక్షుని పాత్ర ద్వారా 'నైరాశ్యంలో ఉన్న వ్యక్తి మానసిక స్థితి, సహాయాన్ని కోరేముందు అవతలి వ్యక్తిలో గమనించాల్సిన లక్షణాలు, ఉత్తముల స్వభావం, వారితో ప్రవర్తించవలసిన విధానం, అభ్యర్థన వ్యక్తపరచాల్సిన తీరు, లోకరీతి, జీవనతత్త్వం – ఇవన్నీ ఈ కావ్యంలో ఆలంకారిక సౌందర్యం మాటున అందంగా ఒదిగిన అంశాలు.

***

విదగ్ధుడైన యక్షుడు తన సందేశాన్ని చేరవేయడానికి ఆవిరి, తేజస్సు, నీరు, గాలి – వీటి సమ్మేళనమైన అచేతన మేఘాన్ని ఎంచుకున్నాడు. బలమైన ఇంద్రియములు కల చైతన్యవంతులు చేయవలసిన పనిని ఒక మేఘం చేయగలదా? అనే విజ్ఞతను సైతం కోల్పోయాడు. ఈ సందర్భంలో కవి **"కామార్తా హి ప్రకృతి కృపణా శ్చేతనా చేతనేషు"** – అని ఈ కావ్యంలో వార్తాహరునిగా మేఘమును ఎంచుకొనుటను సమర్థిస్తూనే కామంతో బాధపడే వారికి చేతనా చేతనముల వివేకము ఉండదనే హెచ్చరికనూ అందజేస్తారు.

***

'పుష్కలావర్తకములు' అనే విభాగానికి చెందిన ఆ మేఘమును కోరుటకు కారణాన్ని వివరిస్తూ "మంచి గుణములు కలవాని విషయంలో ప్రతిపాదన వ్యర్థమైనా కోరుటలో దోషం లేదు. చెడ్డవాని విషయంలో కోరిక తీరినప్పటికీ అడుగుట మంచిది కాదు" అని తెలియజేస్తారు. సహాయాన్ని అర్థించే ముందు అవతలి వ్యక్తి గుణ గణాలనూ పరిగణనలోనికి తీసుకోవాలని, కోరిక నెరవేర్చే స్థాయి ఉన్నా చెడ్డవారిని ఆశ్రయించడం శ్రేయస్కరం కాదని కవి భావన.

***

లోకంలో తనకు పూర్వం సహాయం చేసిన వ్యక్తి వచ్చి ఆశ్రయం కోరితే కాదనరాదు – ఇది మరో సందేశం. నీవు వెళ్ళే దారిలో ఆమ్రకూటమనే పర్వతం ఎదురైనపుడు, అక్కడ నీవు ధారాపాతంగా వర్షం కురిపిస్తే అడవిలో కార్చిచ్చు చల్లారుతుంది. తనకా విధంగా ఉపకారం చేసినందుకు ప్రతిఫలంగా ప్రయాణంతో అలసిన నిన్ను ఆ పర్వతం తలపై మోసి నీకు కొంత విశ్రాంతినిస్తుంది.గతంలో మనం సహాయం పొందిన వ్యక్తి అడిగితే నీచుడు సైతం కాదనడు కదా! ఇక ఉన్నతమైన ఆమ్రకూటము నీకాశ్రయమివ్వటంలో వేరు ఆలోచన చెయ్యదని కవి మేఘానికి తెలియజేస్తూ పై సూక్తిని మనకందిస్తారు.

***

'అంతవరకూ వర్షించిన నీలో సారము తగ్గుతుంది. నర్మదా నదీజలాన్ని త్రాగి మరలా నిండుదనాన్ని సంతరించుకో. లేకపోతే, వాయువు నిన్ను త్రోసివేసే



ప్రమాదం ఉన్నది' అన్న యక్షుని మాటల ద్వారా "దారిద్ర్యంతో ఉన్నవాడు చులకనగా చూడబడతాడు. సంపదతో నిండుగా ఉన్నవాడు గౌరవాన్ని పొందుతున్నాడు" అని అంతర్లీనంగా లోకం తీరుని వివరిస్తారు.

***

కార్యసాధకుడు మార్గ మధ్యంలో ఎదురైన ఆనందాలకు లోబడి లక్ష్యాన్ని విస్మరించకూడదు. రామాయణంలో మైనాకుని కోర్కెను హనుమ నిరాకరించడానికి కారణమిదే. ఈ కావ్యంలో యక్షుడు "నీ రాకతో సంతోషించిన నెమళ్ళు ఆనంద బాష్పాలతో కేకలు వేయగా వాటిని స్వాగత వచనాలుగా భావించి, అక్కడ నిలిచిపోకుండా తొందరగా ముందుకు వెళ్ళే ప్రయత్నం చేయము" అని ప్రార్థనా పూర్వక సూచన చేస్తాడు **"శుక్లాపాంగైః సుజల నయనైః స్వాగతీకృత్య కేకాః / ప్రత్యుద్యాతః కథమపి భవాన్ గన్తుమాశు వ్యవస్యేత్"** శ్లోకంలో.

***

"పూర్వము రంతిదేవుడు అనేక యాగాలు చేసి సంపాదించిన కీర్తి 'చర్మణ్వతి' నదిగా పరిణమించింది. అందువలన ఆ కీర్తికి మర్యాద చూపుతూ అక్కడ నీవు వినయముతో క్రిందికి వంగి ముందుకు ప్రయాణము సాగించు" అని సూచిస్తూ యశః కాయులైన వారి పట్ల చూపవలసిన విధేయతను వివరిస్తారు కవి.

***

మానవ జీవితం చక్రపు అంచువలే తిరుగుతూ ఉంటుంది, ఎల్లప్పుడు సుఖము గానీ, దుఃఖము గానీ ఎవ్వరికీ కొనసాగవనే సార్వజనీన సత్యాన్ని **"నన్వాత్మానం బహు విగణయ...... నీచై ర్గ చ్ఛ త్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ"** అనే వాక్యంలో పొందుపరుస్తారు.

***

హిమాలయ పర్వతాలపై దేవదారు వృక్షాలు అధికంగా ఉండి, గాలికి ఆ చెట్ల కొమ్మల రాపిడి వలన పుట్టిన దావాగ్ని, చమరీ మృగాల తోకల కుచ్చులను కాల్చి ఆ పర్వతాన్ని కూడా బాధిస్తుంది. అందుకే, "నీవు వర్షధారలను తీవ్రంగా

కురిపించి ఆ దావాగ్నిని చల్లార్చుము అని **"ఆపన్నార్తి ప్రశమనఫలాః సంపదో హ్యుత్తమానాం"** – ఉత్తముల సంపదలు ఆపదలో ఉన్న వారి ఆర్తిని తొలగించుటకే కదా! నీవు ఉత్తముడవు కనుక నీ జల సంపదతో హిమాలయాల తాపాన్ని పోగొట్టుము అని యక్షుడు మేఘాన్ని ప్రశంసా పూర్వకంగా నిర్దేశిస్తాడు.

***

ఇతరులపై గల అనురాగాన్ని వ్యక్తం చేసే విధానంలో మన స్థాయి బహిర్గతమౌతుంది. ఉత్తముల అభివ్యక్తి ఎలా ఉంటుందో మేఘాన్ని ఉద్దేశిస్తూ యక్షుని చేత ఈ శ్లోకంలో పలికిస్తారు మహాకవి. **"ప్రత్యుక్తం హి ప్రణయిషు సతా మీప్సితార్థ క్రియైవ"** – మంచి వారి దృష్టిలో ప్రతిస్పందించడమంటే, కోరిన ప్రయోజనము నెరవేర్చుటే. అంటే అనురాగం – వాక్ రూపంగా కాక, క్రియాత్మకంగా కోర్కెలను ఫలవంతం చేయడం ద్వారా వ్యక్తం కావాలని కవి భావన.

మరోచోట **"సూర్యే దృష్టే........ మందాయ న్తే న ఖలు సుహృదా మభ్యుపేతార్థకృత్యాః"** ఉత్తములైన వారు మిత్రుల కార్యమును సఫలం చేస్తానని ఒప్పుకుని, ఆ విషయంలో అలసత్వం ప్రదర్శించరు కదా! నీవు నా మిత్రుడవు కనుక నా పని విషయంలో ఆలస్యం చేయక త్వరగా వెళ్ళుము అంటూ ఒకింత లౌక్యాన్ని ప్రదర్శిస్తాడు.

"నీవు నా భార్యను చేరేసరికి ఆమె దయనీయస్థితి చూచి నీ హృదయము కరిగి, తొలకరి జల్లు రూపంలో కన్నీరు పెట్టుకోగలవు. లోకంలో జాలిగుండె కలవారెవరైనా ఇతరుల కష్టాలు చూచినపుడు దయతో ప్రవర్తిస్తారు" అంటూ మేఘాన్ని దయార్ద్ర హృదయునిగా కీర్తిస్తాడు యక్షుడు.

***

సహాయాన్ని అర్థించేటపుడు సైతం అవతలి వ్యక్తి స్థాయి, మనం కోరదలచిన అంశం ఆలోచించుకోవాలి. ఒకవేళ ఉన్నతస్థాయి వ్యక్తులకు స్వల్ప బాధ్యతలను అప్పజెప్పవలసివచ్చినపుడు వేరొక ప్రత్యామ్నాయం లేని నిస్సహాయతను వినయంగా విన్నవించగలగాలి. ఇలాంటి లోకజ్ఞత యక్షునిలో కనిపిస్తుంది. "నేను చెప్పినట్లు



ఈ దౌత్యం నీకు తగినది కాకపోయినా, నా ప్రార్థన వలన కాని, భార్య నెడబాసి ఉన్నందున నా పై దయతో కాని ఈ సహాయము చేయుము" అని పలికిస్తారు కవి. కావ్య ప్రారంభంలో కూడా యక్షుడు అప్పుడే వచ్చిన కొండమల్లె పూలతో స్వాగత వచనాలు ప్రేమ పూర్వకంగా పలికి తగిన మర్యాద చేసి తన అభ్యర్థన వివరిస్తాడు.

అలాగే, సహాయం చేసిన వారి శ్రేయస్సును, సౌఖ్యాన్ని కాంక్షించడం ఉన్నత సంస్కారం. అందుకే, "నీ ప్రియురాలైన విద్యుల్లతతో నీకు ఎపుడూ వియోగము కలుగకుండు గాక. నీవు ఎల్లపుడూ సుఖముగా జీవించుము" అని శుభాకాంక్షలు అందజేస్తాడు యక్షుడు.

***

శ్రేష్ఠుడైన మేఘుడు యక్షుని సందేశాన్ని యక్షపత్నికి వినిపించి ఆమె ప్రాణములు నిలుచుటకు ఆధారమైనాడు. ఈ సందర్భంలో **"కేషాం న స్యాదభిమతఫలా ప్రార్థనా హ్యుత్తమానాం"** – ఉత్తమ జనుల ప్రార్థన ఎవరి విషయంలో సఫలం కాకుండా ఉంటుంది? అని మరో ఉన్నత సందేశాన్ని కావ్యాంతంలో అందజేస్తారు మహాకవి.

***

అందుకే ఆలంకారిక సౌందర్యంతో పాటు జీవన గమనంలో అనేక సందర్భాలలో ఆవశ్యక దిశానిర్దేశమందించగల అరుదైన కావ్యం – మేఘసందేశం.

*** డిసెంబర్ 2014 "కళా గౌతమి" లో ప్రచురితం.**

# 15 శ్రీ బండారు తమ్మయ్య (1891-1970) సాహితీ వరివస్య

**సరసవిమర్శనాపటిమ, సన్నుత పాండితి, తెల్గుపల్కు సుం**
**దరముగ గూర్చు నేర్పు, సుజనస్తవనీయ విశాలభావబం**
**ధురత, కవీంద్రసన్నుత మనోజ్ఞరసజ్ఞత, సాధుశీలమున్**
**వరలెడుతమ్మయార్యుని ననారతముం బ్రణుతింతు నెమ్మదిన్** – ఇది శివశ్రీ బండారు తమ్మయ్య గారి పాండితీప్రకర్షను, సజ్జనశీలతను గురించి శ్రీ గిద్దలూరు చెంచుబసవరాజు ప్రశంస. నిజానికి, సాహిత్య రంగంలో కృషి చేస్తున్న వారికి మాత్రమే కాక ఇతరులకూ వీరి జీవిత చరిత్ర అధ్యయనం అవసరం. ఎందుకు? అనే ప్రశ్నకు సమాధానం వీరి స్వీయ చరిత్రకు వ్రాసిన పీఠికలో ప్రొఫెసర్ ఎస్వీ. జోగారావు మాటలలో నేరుగా లభిస్తుంది. **"పరమ రమణీయమైనది వారి దర్శనము; వినయ విభూషితమైనది వారి వ్యక్తిత్వము; సౌహార్ద మార్దవ సౌరభోపేతమైనది వారి చరితము. అట్టి మహానుభావుని ఉదంతము మన కవశ్యము గ్రాహ్యము, ఉపాదేయము. వీరి స్వీయచరిత్రమున స్వీయ జీవితోదంతమును సంక్షేపించి ఎక్కువగా సాహిత్యోదంతమునే నిక్షేపించిరి. ఇది వీరి సౌమనస్యమునకు, నిరాడంబరతకు తార్కాణము".** అందుకే వారి సాహితీ వరివస్యను, కొన్ని ముఖ్యమైన జీవిత విశేషాలనూ స్మరించుకొందాం.

**వృత్తిగత – వ్యక్తిగత విషయాలు :** మెట్రిక్యులేషన్‌లో ప్రవేశించేసరికి (1907 సం.) వీరికి పితృవియోగం కలిగినా, హెడ్ మాస్టార్ శ్రీ టి.వి. శ్రీనివాసయ్యర్ ప్రోత్సాహంతో ఆర్థిక సమస్యలను అధిగమించి మెట్రిక్యులేషన్ పూర్తి చేసారు. ఆ సందర్భంలో, పాఠశాల ఎక్స్‌అఫీషియో ప్రెసిడెంట్ అయిన రాజమండ్రి సబ్ కలక్టర్ బహుమతి ప్రదానోత్సవ సభకు రావడం, హెడ్ మాస్టార్ సిఫార్సు మూలంగా రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో నియామకం లభించడం జరిగాయి. వందేమాతర ఉద్యమం అనంతర



పరిణామాలలో జరిగిన నియమావళి మార్పులలో వీరి ఉద్యోగం రెగ్యులరైజ్ చేయబడింది. సర్వీసులో అత్యధికకాలం అమలాపురం తాలూకాలోనే గడిచింది. ఆధ్యాత్మిక వ్యాసంగానికి, ఆచార వ్యవహారాలకు అంతరాయం కలుగుతుందని వీరు పదోన్నతిని ఇష్టపడలేదు, సంబంధిత శాఖాపరమైన పరీక్షలూ వ్రాయలేదు. చాలా సంవత్సరాలు గడిచాక ఉన్నతాధికారుల సూచనల మేరకు వాటిలో ఉత్తీర్ణులయ్యారు. పదవీ విరమణ తరువాత కిర్లంపూడి ఎస్టేట్ మేనేజర్‌గా పనిచేసి 1947లో జమిందారీ రద్దు చట్టం అమలుకాబడి 1951లో కిర్లంపూడి ఎస్టేట్ ప్రభుత్వ స్వాధీనమయ్యేంత వరకూ అక్కడ పని చేసారు. 1957లో 'స్వధర్మ' పత్రికను ప్రారంభించినా ఆర్థిక కారణాల వలన ఎక్కువకాలం కొనసాగించలేకపోయారు. వీరికి ఏడుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. అందులో ఇద్దరు కుమారులు నష్టసంతానం.

వీరి స్వీయచరిత్రలో స్వోత్కర్ష గానీ, వ్యక్తిగత అంశాలపై విస్తృత సమాచారం గానీ ఉండదు. సాధారణంగా ఇతర స్వీయచరిత్రలలా ఎదురైన కష్టాలన్నీ ఏకరవు పెట్టడమూ కనపడదు. పైగా జీవితం పట్ల సంపూర్ణమైన వ్యక్తిగత తృప్తిని వ్యక్తం చేస్తారు. అందుకు తన ప్రతిభ, క్రమశిక్షణ కారణాలని చెప్పుకోకుండా ఈశ్వరారాధనే అని పేర్కొంటూ More things are wrought by prayer - than the world has ever dreamt of (ప్రపంచమెపుడు కలను సైతం ఊహింపని కార్యచయమును ప్రార్థన సమకూర్చును) అనే సూక్తికి తనను, తన జీవితాన్నీ ఉదాహరణగా పేర్కొంటారు.

**ఆంధ్ర సాహిత్య పరిషత్‌తో సంబంధము :**

1910 సమయంలో ఆంధ్ర ప్రాంతంలో భాషా విషయమై విషమపరిస్థితులు నెలకొన్నాయి. 'తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము – అనే నాలుగు విధాల విభజనలో శ్రీ గురజాడ అప్పారావుగారు వంటి పెద్దలు వ్యవహార భాషకే ప్రాముఖ్యత సంతరింపజేయడానికి ప్రయత్నించారు. అదే సమయంలో పర్లాకిమిడిలో రావుసాహెబ్ గిడుగు రామ్మూర్తి పంతులుగారు కూడా వ్యావహారిక భాషలోనే పాఠ్యగ్రంథాలుండాలనే వాదన లేవనెత్తారు.

అయితే, స్వతహాగా గ్రాంథిక భాషాభిమాని అయిన తమ్మయ్య గారి అభిప్రాయంలో ఇవి వింతవాదనలు. వీరి ఉద్దేశ్యంలో – వ్యావహారిక భాష దారీ, తెన్నూ లేనిది. భిన్న ప్రాంతాలలో వివిధ రీతులలో, ఒకే ప్రాంతంలో కూడా సంస్కారాలను బట్టి మారుతూ ఉంటుంది. కాబట్టి దానికి సార్వజనీనత లేదు. అందుకే సంప్రదాయవాదులు ఈ పరిణామాలను తీవ్రంగా పరిగణించారు. ఈ సమయంలోనే విశాఖపట్నానికి చెందిన శెట్టి లక్ష్మీ నరసింహం గారి గ్రీకు పురాణ కథలలో కొంత భాగం స్కూల్ ఫైనల్ పాఠ్య గ్రంథంలో చేర్చబడింది.

అప్పటిలో జయంతి రామయ్య పంతులుగారు (ముక్తేశ్వరం) మద్రాసులో ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్‌గా ఉండేవారు. వీరు పిఠాపురం, వెంకటగిరి, బొబ్బిలి జమిందారులను సంప్రదించి గ్రాంథిక భాషా పరిరక్షణ కోసం 1911లో మద్రాసులో ఆంధ్ర సాహిత్య పరిషత్తును స్థాపించి పరిషత్ ప్రథమ విజయంగా పాఠ్య గ్రంథములలో వ్యవహారిక భాష చేర్చరాదనే నిబంధన తేగలిగారు. దరిమిలా అనేక పట్టుదలలు, వాదాలు ఉద్యమంలా సాగాయి. అప్పటికి తమ్మయ్యగారు అమలాపురంలో రెవిన్యూ ఇనస్పెక్టరుగా ఉన్నారు. పత్రికను నిర్వహించడం, సమగ్రాంధ్ర నిఘంటువు, వ్యాకరణం రూపొందించడం పరిషత్ ప్రధాన లక్ష్యాలయ్యాయి. అందు నిమిత్తం పరిషత్ వివిధ ప్రాంతాల నుండి తాళపత్ర గ్రంథాల సేకరణ చేపట్టింది. పత్రిక చందాదారులందరినీ సభ్యులుగా పరిగణించింది.

ఆ విధంగా పత్రిక చందాదారునిగా, సభ్యునిగా చేరిన తమ్మయ్య గారు 1950లో కార్యవర్గ సభ్యులుగా; 1965లో అధ్యక్షులుగా నియమితులయ్యారు. జయంతి రామయ్య పంతులుగారు, కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రిగారు, కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి తరువాత నాలుగవ అధ్యక్షునిగా వీరు సాహిత్య పరిషత్ సేవ చేసారు. అయితే సూర్యారాయాంధ్ర నిఘంటువు నిర్మాణం పూర్తి కాకముందే 1964లో పిఠాపురం రాజావారు శివైక్యమైనారు. అప్పటికి ఆరు సంపుటాలు (అ నుండి వ వరకు) పూర్తయ్యాయి. చివరి భాగం ముసాయిదా తన హయాంలో తమ్మయ్య గారు పూర్తి చేసారు. అప్పటికి శ్రీ దంటు భాస్కరరావు గారు ప్రధాన కార్యదర్శిగా ఉండేవారు.



ది.03.05.56న ఆంధ్ర సాహత్య పరిషత్ ఆధ్వర్యంలోనే వీరి 65వ ఏట షష్టిపూర్తి ఘనంగా నిర్వహింపబడింది. ఆ సందర్భంలో శ్రీ కాశీ జగద్గురు విశ్వారాధ్య పీఠ స్వాములవారు – 'ధర్మభూషణ' అనే బిరుదు నిచ్చారు. 1960లో దివ్య జ్ఞాన సమాజంలో వీరి సప్తతి సభ జరిగినపుడు ఆంధ్ర సాహిత్య పరిషత్ 'శైవ సాహితీ సార్వభౌమ' అనే బిరుదునిచ్చింది.

**సాహిత్య సంశోధన :** సాహిత్యంలో అప్పటివరకూ చలామణిలో ఉన్న కొన్ని అంశాలను కేవల కల్పితాలుగా పరిగణించారు. అటువంటి వాటిలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు 'వాణి నా రాణి' అని ప్రకటించాడని, జైమినిభారతమును ఒక్క రాత్రిలో రచించాడని ప్రచారంలో ఉన్న ఐతిహ్యములను ఖండిస్తూ 1925లో తణుకులో ప్రసంగించారు.

విమర్శకునిగా వీరికి అత్యంత ఖ్యాతినిచ్చింది శ్రీనాథునిపై పరిశోధనే. **"జయంతితే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః / నాస్తితేషాం యశఃకాయే – జరామరణజం భయమ్" (భర్తృహరి)** శ్లోకానికి లక్ష్యమైన రససిద్ధిగా శ్రీనాథుని ఆరాధించారు వీరు. స్త్రీలోలునిగా, శృంగారిగా శ్రీనాథునిపై ఉన్న అనేక కథలు వీరిని వేదనకు గురి చేసాయి. "శ్రీనాథుని వీధి నాటకం" పేరిట కొందరు ప్రచురణ కర్తలు పుస్తకాలను ముద్రించి సొమ్ము చేసుకోవడం వీరిని బాధించింది. 'ఆంధ్రకవుల చరిత్ర'లో కందుకూరివారు శ్రీనాథునికి స్థానం కల్పించక పోవడం వీరికి ఆశ్చర్యాన్నిచ్చింది. అయితే, 'ఆంధ్ర కవి జీవితములు'లో గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు పై ఆరోపణలను ఖండించినా, ఆ గ్రంథం రెండవ ముద్రణలో శ్రీనాథుడు శృంగారియే అని బలపరిచారు.

వీటన్నిటికీ సమాధానంగా తమ్మయ్య గారు 'శ్రీనాథ మహాకవి – గుణతత్త్వ విచారం' అనే సమగ్ర వ్యాసం వ్రాయగా అది నిడివి బాగా పెరిగి చివరకు గ్రంథం అయింది. ఈలోగా కందుకూరి వారు మరణించడంతో ఆ వ్యాసాన్ని ప్రకటించలేదు.

1923లో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'శృంగార శ్రీనాథం' గ్రంథంలో చేసిన కొన్ని ప్రతిపాదనలు వీరిని నొప్పించడంతో, వాటిని ఖండిస్తూ ఆంధ్ర పత్రికలో వ్యాసం రాసారు. మొదటి భాగం ప్రచురింపబడిన వెంటనే, అందుకు ప్రతిగా

తమ్మయ్యగారి వ్యాసానికి తాను సమాధానం ఇస్తానని పాఠకులు ఈ ప్రతులను జాగ్రత్త చేసుకోవాలని ప్రభాకరశాస్త్రి గారు పత్రికా ముఖంగా హెచ్చరించారు. ఫలితంగా ఆంధ్రపత్రికలో వ్యాసం యొక్క మిగతా భాగాల ముద్రణ ఆగిపోయింది. పత్రికా ముఖంగా సమాధానమివ్వకపోయినా ప్రభాకరశాస్త్రి గారు 'వల్లభ రాయని క్రీఢాభిరామం'లో మరింతగా శ్రీనాథుని వ్యక్తిత్వాన్ని దూషించారు. **ఇక్కడ మనం గమనించవలసినది వారి వారి సిద్ధాంతాల పట్ల, పరిశోధన పట్లగల ప్రబలమైన విశ్వాసం ఈ వ్యాసాల ప్రకటనకు పురికొల్పింది తప్ప వ్యక్తిగతమైన సాన్నిహిత్యం సమకాలీన సాహితీ వేత్తలందరితో ఆజన్మాంతం కొనసాగింది.**

ఇక శ్రీనాథుడు సామాన్య నియోగి కాక, ఆరాధ్య బ్రాహ్మణుడు కావచ్చునని తమ్మయ్య గారి విశ్వాసం. ఇందుకు ఉదాహరణగా 'శివరాత్రి మాహాత్మ్యము' అవతారికలో శ్రీనాథుడు వ్రాసిన

**"భావింతు మదిని మద్గురు**
**భావిత లోకుని మదీశు బరమేశసమున్**
**శైవమత గర్వ నిర్వహ**
**ణావిష్కృత కీర్తి పండితారాధ్య వరున్" అనే పద్యాన్ని పేర్కొన్నారు.** ఈ విషయమై కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారి వంటివారు విభేదించారు. ఈ సందర్భంలో కాళిదాస మహాకవి తన అభిజ్ఞాన శాకుంతలంలో దుష్యంతునిచే "సతాంహి సందేహ పదేషు వస్తుషు ప్రమాణమంతః కరణ ప్రవృత్తయః " పలికించిన మాటలను గుర్తు చేస్తూ తనకూ శ్రీనాథుని పట్ల ఆ ఆలోచన స్ఫురించడం అలాంటిదే అంటారు.

అలాగే, పాల్కురికి సోమనాథుని బసవపురాణం సులభశైలిలో వ్రాయవలసిన ఆవశ్యకతను కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి దృష్టికి తేవడం, ఆ గ్రంథాన్ని వేటూరి ప్రభాకరశాస్త్రి గారు పరిష్కరించి పీఠిక వ్రాయడం, అలాగే పండితారాధ్య చరిత్రకు శ్రీ చిలుకూరి నారాయణశర్మ గారు పీఠిక రాయడం ఆ పీఠికలలో కొన్ని అంశాలు (అప సిద్ధాంతాలని తమ్మయ్య గారి భావన) శైవమతారాధకులను నొప్పించడం వంటివి వీరి స్వీయ చరిత్రలో మనకు ఎదురవుతాయి.



అలాగే, వేమనను యోగిగా గుర్తించిన తెలుగు సమాజం కవిగా విస్మరించి స్వల్ప ప్రాధాన్యతనే ఇచ్చిందని వాపోతారు.

**మనియుండెడి జనమెల్లను**
**చనిపోయినవారి పుణ్య సత్కథలెలమిన్**
**వినవలె గనవలె మనవలె**
**అనిమిషులకునైన దెలియ దంత్యము వేమా!** అనే వేమన పద్య సందేశాన్ని సూచనగా ప్రస్తావిస్తారు.

**ప్రశంసలు – బిరుదములు :** బాపట్ల ఆంధ్ర సారస్వత పరిషత్ 'విమర్శకాగ్రేసర' బిరుదునిచ్చింది. 1952లో గుంతకల్లులో శ్రీశైల జగద్గురు వాగీశ పండితారాధ్య మహాస్వామి 'ఐతిహాసిక సామ్రాట్' బిరుదునిచ్చారు. ఇంకా ధర్మభూషణ, శివ శరణ, శైవ సాహితీ సార్వభౌమ, సోమ సాహిత్యాచార్య మొదలగునవి మరికొన్ని.

"వీరి నిరంతర కృషి మూలంగానే ఆంధ్రమున వీర శైవ సాహిత్యమునకు గొప్ప స్థానం లభించింది. లేకపోతే, అది ఏ జంగపు పాటల క్రిందనో నామరూపాలు లేక పడిఉండేది" అని శ్రీ చిలుకూరి నారాయణరావు పంతులుగారు ప్రశంసించారు. గిడుగు రామ్మూర్తి పంతులు గారు He is an authority on what he writes అని కొనియాడారు.

ఇక, తమ్మయ్య గారి "పాల్కురికి సోమనాథ కవి" అనే గ్రంథముపై శ్రీ సి.ఆర్.రెడ్డి "Both from the point of view of historical criticism and literary valuation, your book leaves nothing to be desired large number of Virasaiva poets and added to the richness & Variety of Telugu literature. I must also congratulate you on your own wonderfully fine prose. Prose is not such an easy composition as people imagine. It also requires artistic skill of a high order" అని తమ అభిప్రాయంలో పేర్కొన్నారు.

1968లో ఉస్మానియా విశ్వ విద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు దివాకర్ల వేంకటావధాని గారు "వీరి శైలి ఓజః ప్రసాద గుణములకు వైరుధ్యము బాపి ఏకాశ్రయత్వము గల్పించినది" అని ప్రశంసలో వ్రాసారు.

వీటితో పాటు, 1960లో వీరి సప్తతి సందర్భంగా వారి అమ్మాయి శ్రీమతి అలివేణి ప్రసంగంలోని విషయాలను ఇక్కడ మనం ముచ్చటించుకోవాలి. "త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణాం యశసే విజిగీషూణాం ప్రజాయై గృహ మేధినాం" – రఘువంశంలోని ఈ శ్లోకాన్ని వారి తండ్రిగారికి అన్వయిస్తూ వంశోద్ధరణ కోసం వీరు గృహస్థాశ్రమం స్వీకరించారు గానీ ఐహిక భోగముల కోసం కాదని వారికి జన్మించిన తాము ధన్యులమని కొనియాడారు. ఈ విధంగా వ్యక్తిత్వంతో కుటుంబ సభ్యుల నుండి, భాషాసేవతో సాహితీప్రియుల నుండి పరిపూర్ణ గౌరవాన్ని పొందిన మూర్తిమత్వం తమ్మయ్య గారిది.

వీరి జీవన కాలంలో 8 గ్రంథాలను పరిష్కరించి, ప్రచురించగా; ఆరింటిని కన్నడము మరియు ఇతర భాషల నుండి ఆంధ్రీకరించారు. పది గ్రంథాలను స్వయంగా రచించారు. వీరి షష్టిపూర్తి, సప్తతి సంచికలు కూడా వెలువరింపబడ్డాయి. ఇవికాక 78 వ్యాసాలు నాటి ప్రసిద్ధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఇవన్నీ వీరి విమర్శనా నైపుణిని; పరిశోధనా స్థాయిని ప్రస్ఫుటపరిచే తార్కాణాలు.

**ఉద్బోధ :** ఇంతటి సుదీర్ఘ సాహితీయానం చేసిన వ్యక్తి స్వీయచరిత్రలో భావితరాలకు ఇచ్చిన సందేశంలో సాహిత్య సంబంధిత అంశాలు ఎక్కడా కనిపించవు. వీరశైవ మతమున జన్మించుటయే బహుజన్మ పుణ్యఫలముగా భావించి లింగధారణము, శివదీక్ష, ఇష్టలింగమునకు అభిషేకం, ప్రణవసహితముగా శివపంచాక్షరిని జరిపించుట వంటి కనీస ధర్మముల ఆచరణ గురించే ప్రస్తావిస్తారు. అందుకే, ఆధ్యాత్మిక –సాహిత్య వ్యాసంగాలు పడుగు, పేకల్లా కలిసిన వీరి జీవిత గమనంలో చాలా సందర్భాలలో వీరిలో ఉపాసకుడు పరిశోధకుని కంటే రెండడుగులు ముందుకు వేసాడనిపిస్తుంది.

ప్రారంభంలో పేర్కొన్నట్లు సాహిత్య, ఆధ్యాత్మిక జీవులిరువురికీ అనుసరణీయమైన అంశాల సమాహారం శివశ్రీ బండారు తమ్మయ్య గారి జీవనసారం.

**✻ డిసెంబర్ 21, 2014లో "ఆంధ్ర సాహిత్య పరిషత్", కాకినాడలో ప్రసంగం.**
**✻ మే 2015 "సీనియర్ సిటిజన్ వాణి" పత్రికలో ప్రచురితం.**



# 16 కాలాన్ని గడపడం కోసం కాదు, గెలవడం కోసం వ్రాసిన కవిత్వం "తెల్లారితే..."

Before you speak, let your words pass through three gates. At the first gate, ask yourself "Is it true?" At the second ask "Is it necessary?" At the third gate ask "Is it kind?" - Sufi saying. అయితే, కొన్ని క్షణాలు లేదా నిమిషాలకు పరిమితమయ్యే సంభాషణకు ఇన్ని నిబంధనలుంటే శాశ్వతమైన కవిత్వాన్ని సృజించే కవికి ఎన్ని నియమాలుంటాయ్? మిగతా విషయాలెలా ఉన్నా, తాము తెలుసుకున్న నిజాల్ని, గుర్తించిన సామాజిక అవసరాల్ని, దైనందిన జీవితంలో ఎదురైన కరుణార్ద్రపూరిత సన్నివేశాల్ని కవిత్వీకరించి మనం గట్టిగా బిగించేసుకున్న తలుపులన్నీ తెరిచి హృదయాలలో నేరుగా ప్రవేశించగల కవిత్వం ఈ "తెల్లారితే".

శైలి, శిల్పాలలో తేడాలున్నా, ఆలోచనలలో, ఆశలలో, ఆశయాలలో సారుప్యత గల శ్రీ విల్సన్‌రావు, శ్రీ ఆంజనేయ కుమార్ భౌగోళికంగా రెండు ప్రాంతాల వ్యక్తులుగా విడివడినా కవిత్వ ఆరాధకులుగా ఏకమై ఒకే పథంలో సాగించిన ఈ కవితా యానాన్ని పరికిద్దాం.

ఈ సంకలనంలో ముందుగా ఎదురయ్యే శ్రీ విల్సన్ రావు కవితలలో వడి వడిగా ఒకింత వాడిగా నడిచిపోతున్న వాక్యాలు ఏదో గుర్తొచ్చినట్టు ఆగి మరలా చదివేలా చేస్తాయి. రాత్రంతా వాన కురిసినపుడు కవి గుర్తుకు తెచ్చుకున్న ఒకానొక జ్ఞాపకాన్ని **"వాన కడిగిన చీకటిలో / ప్రవహించే జ్ఞాపక మొకటి"** అనడం ఈ కోవకు చెందిన ఓ ప్రశంసనీయమైన ప్రయోగం.

జీవితకాలమంతా "బాధ, సంతోషాల జమిలికత్తులపై కాలాన్ని వెంటేసుకు తిరిగిన జీవన పోరాట యోధురాలికిగా" తన తల్లిని వర్ణిస్తూ... ఆమె ఋణాన్ని తీర్చుకోవాలంటే **"నాలోంచి నన్ను చేదుకుని, తరతరాలు తలెత్తుకుని సెల్యూట్ చేసే / అసలు సిసలైన అమ్మ జెండా ఆవిష్కరించాలి"** అంటారు.

మరో కవితలో, ఉన్నత స్థాయికి చేరాక తల్లి త్యాగాన్ని కేవలం బాధ్యతగా భావించి విస్మరించిన కొడుకులనుద్దేశించి ఆ తల్లిచేత **"ఏ అస్పష్టతా లేదు / అలాగని ఏ విశ్లేషణా అవసరం లేదు / నిన్ను నీలోంచి వెలికితీసి వెలుగుదారి చూపి / మనిషిగా మార్చందే నిష్క్రమించబోను....". "తెరుచుకోని నీ విచక్షణా నేత్రానికి / జీవిత నిర్వచనమేమిటో ఎరుకపరచి / సంతోష రహస్యాన్ని తెలిపి / నిన్నొక సజీవ జీవన కావ్యాన్ని చేసేదాకా / జీవనదినై అమ్మలా ఇలా ప్రవహిస్తూనే ఉంటా"** అనిపిస్తారు. ఇది ఒక వినూత్న ఆలోచన. కృంగిపోయో, ప్రేమతోనో, ఓరిమితో సహిస్తూనో, లేక పదిమందిలో అల్లరిచేసో కాకుండా అతడిని మనిషిగా మార్చాల్సిన బాధ్యత స్వీకరించడం, జీవిత నిర్వచనమేమిటో, సంతోష రహస్యమేమిటో మనకు చెప్పకనే చెప్పడం కవిత స్థాయిని పెంచే అంశాలు.

మరో కవితలో **"ఎన్ని వెలుగు విల్లుల్ని ఎక్కుపెట్టినా / నీ అహంకార అంధకారాలు తొలిగిపోలేదు / ఎన్ని నిట్టూర్పు తుఫానులు వీచినా / నీ అణచివేత శిలలు కరగనే లేదు / ఇప్పటికైనా నీవు, నీకు నువ్వు సజీవదహనమై / నిప్పుల్లోంచి మరల జన్మించి ఆమెలోకి ప్రవహించాలి"** అంటూ తీవ్రపదజాలంతో ఇంకా (కొందరు పురుషులు) మారాల్సిన అవసరాన్ని సూచిస్తారు.

వేరొక కవితలో అమ్మకు ప్రతిరూపంగా నిలిచిన మరో స్త్రీని పేర్కొంటూ **"చిట్లిన ప్రపంచంలో ఇప్పుడెక్కడుందో తెలీదు కానీ / నా లోపలి గుండె గుడిలో పదిలంగానే మిగిలి వుంది / నవ్వుల్ని కాటేసే ముఖాలుంటాయని తెలియని ఆమెను 'ఆయా' అని ఎవరైనా అంటే / నన్ను నేను ఖాళీ చేసుకున్నంత బాధ"** అంటూ ఆమెను స్మరిస్తారు. ఇక్కడ "నన్ను నేను ఖాళీ చేసుకున్నంత బాధ" అనడం వేళ్ళపై లెక్కించగల కవులు మాత్రమే వ్రాయగల వాక్యం.

పై కవితలను పరిశీలించినపుడు "నాలోంచి నన్ను చేదుకుని" "నిన్ను నీలోంచి వెలికితీసి" "నన్ను నేను ఖాళీ చేసుకున్నంత" వాక్యాల ద్వారా శ్రీ విల్సన్ అభిప్రాయంలో 'నేను' అనేది ఏకవచనం కాదు. నన్ను నాలా ఉండనీయని వేరెవరో నాలో ఉన్నారు. ముందువాడు సంస్కరింపబడాలి అనేది వారి ఉద్దేశ్యంలా కనిపిస్తుంది.



మరికొన్ని కవితలు ప్రపంచీకరణ, సామ్రాజ్యవాదాల ఇతివృత్తంలో సాగుతాయి **"ఇతరుల మరణాల మీద జీవించడం / జీవిస్తూ మరణించే వ్యసనం ఆవహించాక / ఒప్పందపు వికృతత్వం లేనిదే ఏ పనీ ముందుకు సాగదు వాడికి"** అంటూ ఒప్పంద సమయంలో తాము కోట్లాది ప్రజల భవిష్యత్తును నిర్ణయిస్తున్నామనే విషయాన్ని గుర్తెరగాలని సూచించారు. **"సర్వాంగాలూ డాలర్లకు మోకరిల్లుతుంటే / మానని గాయాలకు లేపనం పూసి ఏం లాభం?"** అని ప్రశ్నిస్తారు. **"నీకూ స్వర పేటిక ఉందని / ఇప్పటికైనా గుర్తించి చైతన్యమై చిగురించకపోతే / రేపటి రోజున నువ్వు అరచి గీపెట్టినా / రవ్వంత శబ్దాన్ని పెకలించలేవు / నువ్వు సొమ్మసిల్లే దాకా ఏడ్చినా / ఒక్క కన్నీటి చుక్కా రాల్చలేవు / ఎందుకంటే / దేహంలో అన్ని తంత్రుల్ని డాలర్లతో బంధించి / ఏ రెండు అంగాల్నీ సంభాషించుకోనీకుండా / సర్వ హక్కు భుక్తం రాయించుకుంటున్నాడు వాడు...."** అంటూ మనలను హెచ్చరిస్తారు. మరో కవితలో **"మట్టి పరిమళాన్ని చట్టబద్ధంగా ఉరి తీసి ఎన్నో ఏళ్ళయింది"** వాక్యంలో ప్రతి పదమూ ఓ పేజీ విశ్లేషణకు అవకాశమిచ్చేంత లోతైనదే.

జ్ఞానపీఠ అవార్డ్ గ్రహీత డా. రావూరి భరద్వాజకు నివాళినర్పిస్తూ **"నువ్వేం ఆశించావు గనుక – దుఃఖబాధితుల కష్టాలన్నీ తొలగాలని / అందరికీ అనునిత్యం శుభమే కలగాలని తప్ప.... / అక్షరం మనిషికి ఆలంబనగా వుండాలంటూ / అసహాయ మహిళకు అందదండలయ్యావు తప్ప...."** అంటూ కవి ఆకాంక్ష సమాజ హితమేననే సత్యాన్ని తెలియజేస్తారు. **"నువ్వు తాకిన అక్షరం వర్ణరంజితమై / వెలుగు రేకై విచ్చుకుని జ్ఞాన పీఠమెక్కింది"** అనే వాక్యంలో కవి మిగుల్చుకొనేదేమిటో తెలియజేస్తూ **"నువ్వెగరేసిన అక్షర జెండాని మా గుండెల్లో నాటుకుంటా"**మని ప్రతిన పూనుతారు.

ఇక, తొలిపొద్దు నుండి మలిపొద్దుదాకా రైలులో పాటలు పాడుతూ బతికే అమ్మాయి గురించి **"ఎన్ని పద్మాలైనా ఆ గొంతుకు అభివాదం చేయాల్సిందే / పెట్టెలోంచి పెట్టెలోకి మారుతున్నపుడల్లా / ఇంకిన నదిపై ఆకుపచ్చని స్వప్నాలేవో / దూరమవుతున్న బాధ" "అమ్మ పాలరుచి గుర్తులేదట / నాన్న మీసపు స్పర్శ తెలియదట చిటికెన వేలు విడువని తమ్ముడు / జీవితాన్ని నేర్పే అంధతాత: ...... కుట్ర కుతంత్రాల**

**వాసన సోకని మనిషెవరైనా ఉంటే జాతీయ గీతం నేర్చుకుంటుందట, ఎవరు ముందుకొస్తారో తెలపండి"** అంటూ జాతీయ గీతం నేర్పేందుకు ఆమెకు 'గురుత్వం' వహించే అర్హతగల వారు కరువయ్యారనడం ద్వారా, ఆమె బాధ, బాధ్యతలతో పాటు ఆమె ఔన్నత్యాన్ని ఆకాశానికి చేరువ చేస్తారు.

***

ఇక, సాహితీ సృజన లక్ష్యాన్ని ఆవిష్కరించే ప్రయత్నంతో శ్రీ ఆంజనేయ కుమార్ కవిత్వం మనకు పరిచయమవుతుంది. శ్రీ శ్రీ ని స్మరిస్తూ రాసిన కవితలో **"కిటికీ దగ్గర కూర్చుని, కాలాన్ని గడపడం కోసం రాసినవి కాదు... మనిషి గుండె దగ్గర కూర్చుని... కాలాన్ని గెలవడం కోసం రాసినవి"** అని ప్రతిపాదించి దానిని రూఢిపరిచే క్రమంలో **"నేల మీద పారినంతమేరా / సంవత్సరానికి రెండో, మూడో పంటలు పండించిన నది / సహజత్వాన్ని వదులుకోలేక / సముద్రంలో కలిసినా కూడా... / రోజుకి రెండు ఫలాల్ని సూర్యచంద్రులుగా పండించే గుణాన్ని... / కారు చీకటి కారాగారంలో పెట్టినా / కవిత్వాన్నే రాసే కవిని చూసి నేర్చుకుని వుంటుంది / ఎందుకంటే... మహా విస్ఫోటనంలోంచి జనించిన జీవరాశికి / జవజీవాల్నిచ్చింది కవే కదా!" అంటారు"** – కవిని జీవనదితో పోలుస్తూ. అందుకే, **"నువ్వు కవయితే చాలు / స్థాణువైన ఆశల్ని వేణువుల్ని చేసి పలికించగలవు"** ఇది శ్రీ కుమార్ అచంచల విశ్వాసం.

సమకాలీన అంశాలను కవితావస్తువులుగా స్వీకరించినపుడు ఆ అంశం భవిష్యత్తులో నిలవకపోయినా కవిత్వం నిలుస్తుంది. అందుకే అంశమేదయినా, పాఠకుడికి అన్ని సందర్భాలలో కవితో భావసారుప్యత లేకపోయినా, కవిత్వాన్నే చూసినపుడు ఆస్వాదించగలుగుతాడు.

ప్రస్తుత రాజకీయాలు, నాయకులు, వారి వ్యక్తిగత జీవితాలు వీటిచుట్టూ భ్రమణం చేసిన కొన్ని కవితలలో అలా మనం ఆస్వాదించి అభినందించగల కవిత్వం ఎదురవుతుంది. **"గెలువబోయేదెవరో చెప్పేస్తున్న 'ఎగ్జిట్ పోల్స్'లా / గెలిచాక వారు చేసే దురాగతాల్ని ముందుగా విప్పే / ఆధునిక భవిష్య దర్శినులు / ప్రజల కెవరన్నా కానుకగా ఇస్తే బాగుండు"** అంటారు కవి.



ఇక రాష్ట్ర విభజన అనంతర పరిణామాల నేపథ్యంలోని కవితల్లో **"స్నానం చేసిన తర్వాత పక్కన పెట్టిన సబ్బుబిళ్ళ / కాసేపటికి అతుక్కుపోయినట్టు / నాణెం వేసిన తర్వాత గాజులోని నీటిలో / అది పెద్దదిగా కనబడినట్టు / కొన్నిటికి అతుక్కుపోయిన నీకు / మరికొన్ని మరింతలై కనబడవచ్చు"** అని విమర్శిస్తూ **"విరాట్ నదికి వలస ఏంది తండ్రీ? నీ ఉచ్ఛ్వాసంలో నీకు ప్రాణదానం చేసిన తర్వాత / నీ నిచ్ఛ్వాసమై వలస పోయిన గాలిని నే నంటనంటూ... మిన్న కుంటావా?"** అంటూ ప్రశ్నిస్తారు.

**"మహా సముద్రాలు సైతం విభజించలేని / మమతల నేలపై వెల్లకిల్లా పడుకుని చూడమని"** నిర్దేశిస్తూ మమతకు, మానవతకూ విభజన లేదని తెలియజేస్తారు. అలాగే, ఉద్యమంలో ప్రాణం విడిచిన విద్యార్థులను ఉద్దేశించి **"నూటికి నూరు మార్కులు వస్తాయనుకుంటున్న ఆశలకు / నిండు నూరేళ్ళు వస్తాయి" అంటారు. అలాగే,** జరిగిన విధ్వంసాన్ని నిరసిస్తూ **"జ్వరాన్ని సెల్సియస్‌లో బదులు ఫారన్ హీట్ డిగ్రీలలో చెబితే ఎక్కువ గాభరా అంకెలు కనబడినట్లు / ధ్వంసాన్ని మాటలతో బదులు పలుగుపారలతో చేస్తే / ఎక్కువ పతాక శీర్షికాక్షరాలు"** అంటారు. ఈ సమయంలోనే విజయనగరం కర్ఫ్యూ సంఘటనను, సామాన్య మహిళల నుండి వ్యతిరేకత వ్యక్తమైన దృశ్యాన్ని **"చిన్నప్పుడు తమ ఒడిలో నన్ను ఊరడించిన తల్లులేనా... ఆగ్రహంతో తొడలు కొడుతూ / కరడు కట్టిన కర్ఫ్యూ తుపాకులపై / తమ చేతులు కొరడాలుగా ఝుళిపిస్తున్నారు?"** అనడం వారి గుండెలను రగిల్చిన ఆవేదనకు అద్దం పడుతుంది.

ఇక, ప్రపంచీకరణ నేపథ్యంలో బహుళజాతుల కుటిలత్వాన్ని విమర్శిస్తూ **"మన పెరటి వేపచెట్టుపై మనకు తెలీకుండా తానే / హక్కులు రాసేసుకుని / చేవనంతా గొట్టంవేసి పీల్చేసి / చేదును మాత్రం మనకు చుట్టంగా మిగిల్చా"** యంటారు.

ఒంటరిగా ఉన్న సమయంలో మహిళపై అత్యాచారం జరిగిన సంఘటనకు స్పందిస్తూ "సీతాకోకచిలుక చేత చిక్కినా చిదిమేది కాదనే విజ్ఞత లేనివాడికి **"సెల్ఫోన్**

**తెర తాకగానే కోరుకున్న బొమ్మ వచ్చినట్టు / పరస్త్రీ మేను తాకగానే / జన్మనిచ్చిన తల్లి గుర్తొస్తే ఎంత బాగుండు?"** అనడం కవి పరిణతిని తెలియజేసే వాక్యంగా నిలుస్తుంది.

***

ముందుమాటలో రచయితలు పేర్కొన్నట్లు – రెండు ప్రాంతాల ప్రజలు ఓ చారిత్రక సన్నివేశంలో నిలబడినపుడు; ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలనే నామవాచకాల మధ్య 'తెలుగు సమాజం' అనే పదబంధం ప్రాచుర్యం పొందుతున్న సమయంలో, రెండుగా చీలిన ప్రజల మధ్యగల భాష అనే వంతెనపై నడిచిన ఈ యుగళ కవితా సంకలన ప్రయత్నం మరెందరికో స్ఫూర్తినివ్వాలని ఆశిద్దాం.

- **అక్టోబర్ 5, 2014న గ్రంథావిష్కరణ సందర్భంగా సమీక్ష.**
- **నవంబరు 2014 "మల్లెపందిరి"లో ప్రచురితం.**



# 17 అనుభూతి అక్షరమైతే "అమృతం కురిసిన రాత్రి"

ఓ వ్యక్తి సాహిత్య కృషి సంపుటం కాకముందే ఆ కవిత్వంపై వ్యాఖ్యానాత్మక సమాలోచనతో గ్రంథం రావడం; ఆ కవి కీర్తిశేషుడయ్యాక గ్రంథస్థం కాబడిన సాహిత్యం అనేక ముద్రణలకు, అవార్డులకు నోచుకోవడం అరుదు మాత్రమే కాదు, దాదాపు అసాధ్యం కూడా. ఈ ప్రత్యేకతను సొంతం చేసుకొని, తెలుగు సాహిత్యంలో వచన కవిత్వానికి, అందునా అనుభూతి కవిత్వానికి ప్రత్యేకతను సంతరింపచేసిన గ్రంథం "అమృతం కురిసిన రాత్రి".

**దేవరకొండ బాల గంగాధర తిలక్** – అందమైనవాడు, ఆనందం మనిషైన వాడు, జీవితాన్ని హసన్మందార మాలగా భరించినవాడు. సూర్యుడిని తలమీది పువ్వుగా చేసుకోగలిగినవాడు. తెలుగు భాషను శరద్విహారవనాన నడిపించి వెన్నెలలో ఆడుకునే ఆడపిల్లలను, కన్నీటి జడులలో తడిసే దయాపారావతారాలను అక్షరాలుగా రూపాంతం చెందించినవాడు. అందుకే ఆ కవిత్వంలో అందినంతమేర కవిని అందుకునే ప్రయత్నం చేద్దాం.

**కవిత :-**

**'నా కవిత్వం కాదొక తత్త్వం'** అన్న తిలక్ తన కవిత్వాన్ని తత్త్వమయం చెయ్యలేదు. అలా అని తాత్త్వికత నుంచి దూరం కాలేదు. **గతమంతా తోలుబొమ్మ లాడిన ఒక తెర; వర్తమానం నీ కన్నుల గప్పిన ఒక పొర (పాడువోయిన ఊరు); ఆనందానికి మేర విషాదమని నలుదెసలూ కల్సిన చోట వ్రాయబడి ఉందిటగా (ప్రవాస లేఖ)** వాక్యాల్లో అంతులేని జీవన తాత్త్వికత అణువణువునా పలుకరిస్తుంది. తాత్త్విక సారంలో ముంచని కలం ఆ మాటలు వ్రాయగలదా! ఇక "ముసలివాడు" కవితలో అతని వార్ధక్య ప్రతిరూపాలుగా పై కప్పు వంగిపడు పాడిల్లు, ఆరిన వత్తికొడి, ఎముకల గూడు, అరిగిపోయిన జోడు – వీటన్నిటినీ పేర్కొని; **ఒకనాడు నే వలచి**

పెండ్లాడిన ఒయ్యారపు భార్య అదిగో; విధి లిఖించిన వెర్రి చిత్రమువలె, ఎండిపోయిన **ఏటిగట్టు వలె, నడుమునొప్పి తనకు మిగిలిన శక్తిగా, పక్షవాత భయం తన భవిష్య దాశగా కదలలేక, మెదలలేక మెతుకులు కతకలేక చావును వెతికికొనే నా వయ్యారపు భార్య అదిగో** అని ఆ వృద్ధునిచేత అతని భార్యను పరిచయం చేయిస్తారు. చివరికి వార్ధక్యాన్ని **అది జీవన సత్యం, నాగరికత గమ్యస్థానం, చరిత్రల సారాంశం** అని తేల్చి చెబుతూ కవితకు తాత్విక ముగింపునిస్తారు.

**'బాట ప్రక్క; కడుపులోన కనులుపెట్టి; సదలిపోయి వదలిపోయి; మండి పోయి మాడిపోయి; ఆకాశపు కప్పు క్రింద; అనంత విశ్వపు గదిలో; ఆకలితో ఆడుకుంటూ; ఆకలినే ఆరగిస్తూ; నల్లని మట్టిదిబ్బలా; చెల్లని పెంటకుప్పలా; కూరుచున్న కబోదికి; పంగుకు, వికలాంగుకు; నిస్సంగుకు, నిర్సాంగుకు; భయమే లేదా! బాధయే లేదా!"** – "ఖాళీ చేసిన" కవితలోని ఈ వాక్యాలలో ఒక అద్భుతమైన రైమ్, రిథమ్ పోటీపడుతూ మనలోని కవితా ప్రియత్వానికి, దాగున్న మానవత్వానికి ఏది ముందు మేల్కొంటుందోనని పోటీ పెడతాయ్. ఇక, 'సైనికుడి ఉత్తరం' కవితలో చుట్టూ ఉన్న భౌతిక స్థితిని వర్ణించి, చివరకు **"చలి గుండెల మీద కత్తిలా తెగింది; నీ రూపం నా దేహానికి వెచ్చగా తగిలింది"** – వాక్యంలో ప్రతిపదం వేల భావనలను ఉదయింపచేస్తుంది.

'ఆ రోజులు' కవితలో యౌవనాన్ని **"అమాయకపు కళ్ళతో బాధ్యతలు లేని బలంతో"** అని అత్యంత సరళంగా రాయగలిగినా; 'కఠోపనిషత్' కవితలో **నెత్తుటిలో దోగుతున్న చరిత్ర శిశువుకు బొడ్డుకు బదులు పొట్టను కోసిన అవివేకపు మంత్రసానులుగా** దేశాధినేతలను విమర్శించినా; రాత్రిపూట రాజమండ్రి గౌతమి జలాల్లో ప్రతిఫలిస్తున్న విద్యుద్దీపాలను – **ఎవరీవిడ ధమ్మిల్లంలో యిన్ని కాంతి లతాంతాల్ని తురిమారు? ఎవరీవిడ గుండెల్లో ఇన్ని కాంక్షాకీలల్ని వెలిగించారు?** అని విస్తుపోయినా; స్పృశించిన ప్రతి అంశాన్నీ కొత్తదనంతో మెరిపించడం వీరి మహత్తు.

ఇక, 'నిన్న రాత్రి' కవితలో ఎత్తుగడ అద్భుతంగా ఉంటుంది. **ఒక్కమాట చెప్పు నిన్న రాత్రి దేవుడు వచ్చి నా మంచం మీద కూర్చుని దీనంగా నాకేసి చూసి**



**కన్నులు దించుకున్నాడు ఏమైనా అన్నానా? నే నేమైనా అన్నానా?** అని ప్రారంభమై ఆత్మహత్య చేసుకున్న అబ్బాయి, సానిపడచు దీనావస్థ, యుద్ధంలో మరణించిన సైనికుని తల్లి ఆవేదన, వివిధ దేశాల్లో దుర్భర దారిద్ర్యం, వీటన్నిటినీ నిలదీసానా? అని తనను తానే ప్రశ్నించుకొని **మానవుడే దానవుడై తిరగబడినప్పుడు పాపం పెద్దవాడు కన్న కడుపు ఏం చేస్తాడని?** అని మనం ఊహించని రీతిలో దేవుని అసహాయత అనే కొత్త కోణంలో కవితను ముగిస్తారు.

'కిటికీ'లో **నా లోంచి కిటికీ అవతలకి దిగంతాలకి వ్యాపిస్తున్న నేను; బయటి నుండి కిటికీ లోపలి సంకోచించుకుపోతున్న నేను"** అన్నపుడు బహిర్వర్తన, అంతర్వర్తనల మధ్య విభజన రేఖలా కిటికీ కనిపిస్తుంది. అలాగే, **కెనడీ మరణం నేపథ్యంలో మహాత్ముల, మనీషుల రుధిరంతో మరకపడింది ధరిత్రీ వదనం'** – 'దుర్మరణ వార్త'లో ఈ ఒక్క వాక్యం చాలు జరిగిన అపచార తీవ్రతను తెలియ జేయడానికి.

**రాత్రిని రంపం పెట్టి కోసినపుడు రాలిన పొట్టులాగుంది వేకువ** – ఇలాంటి పదచిత్రాలు ప్రతి కవితలో మనను పలుకరిస్తాయి. **రాత్రి క్లబ్బులో తప్పతాగి తందనాలాడి వచ్చిన భర్త క్షేమానికి తులసి కోట చుట్టూ కన్నీటి దీపాలు వెలిగిస్తున్న ఇల్లాలు** – ఇటువంటి వాక్యాలు ముగింపు లేని ఆలోచనలతో మనలను ఉక్కిరిబిక్కిరి చేస్తాయి.

'కవిత్వమంటే' వ్యాసంలో – "ఏ అనుభూతిని ఎంత పరిమాణంలో ఏ తీవ్రతతో, తాను పొందాడో అతని మాటల ద్వారా మనకి అందివ్వగలిగినవాడు నిజమైన కవి అని నిర్వచించిన తిలక్, ఇటు అభ్యుదయ భావన, అటు కాల్పనికోద్యమ కాలం నాటి శబ్ద సౌందర్యపు మేళవింపుతో తనదైన శైలీరమ్యతతో లెక్కకు మిక్కిలిగా తన కవితా పంక్తులను పాఠకులకు హృదయస్థమే కాదు, మార్గదర్శనమూ చేస్తారు. సగం గ్రాంథికం, సగం వ్యావహారికం గల వీరి శైలిని సాంకర్య దశగా విమర్శించిన కుందుర్తి వంటి వారు తిలక్ చూపిన ఒడుపు వల్లనే వచన కవితా ప్రక్రియ పరిపుష్టం కావడానికి, సంప్రదాయ పద్య కవితాభిమానులను కూడా వశపరచుకోవడానికి దోహదకారి కాగలిగినదని అంగీకరించారు. సమకాలీన కవులు తిలక్ కవిత్వంపై

చేసిన అనేక విమర్శలను శ్రీ సోమసుందర్ తీవ్రంగా ఖండించి 'కవి హృదయాన్ని' తన "అమృత వర్షిణి" గా మనకు సాక్షాత్కరింపజేసారు.

ఈ కవితా సంపుటిలో బహు పార్శ్వాలలో అభివ్యక్తీకరింపబడి ప్రధానంగా నిరసనకు గురైన అంశం యుద్ధం. 'పిలుపు'లో యుద్ధాన్ని **ధాత్రీ జనని గుండె మీది కొరకంచుగా** అభివర్ణిస్తారు. యుద్ధానంతరం **దరిద్రుని నోరులేని కడుపు తెరుచున్న నాలిక బూడిదలో వ్రాసుకున్న మాటలు మీరెపుడైనా చూశారా, కన్నీరైనా విడిచారా** అని ప్రశ్నిస్తారు. వాడికి కడుపు (ఆకలి) ఉంది. కానీ నోరు (ఆహారం) లేదు. ఇవి భరించలేని కవి "భూలోకం" కవితలో **"ఛటచ్ఛటా శబ్దమేమి చక్రాలకి రక్తమేమి ఏం లోకం తల్లీ – యిట కనుపించదు కాలనేమి?"** అని ఆర్తిగా అడుగుతారు. అదే కవితలో **"కాలు కడుపు ఇమ్మన్నది – గాజు మేడ లేదన్నది"** అనే వాక్యాలు సుసంపన్న జీవితాన్ని గడిపిన వారి కలం నుండి వెలువడటం ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి.

ప్రాక్పశ్చిమాల విషపు పరిధులు దాటి గిర్రున తిరుగుతున్న వేదం, శాస్త్రం, విజ్ఞానం; పట్టణాలు, పల్లెటూళ్ళు పిడికెడు బూడిదలో పేర్లు వ్రాసికొంటాయని శిక్షా పత్రంలో సూచన చేస్తారు. **"ఒకనాడు గల గలా ఫెళ ఫెళా విరిగి పడుతుంది నీ రంగు గాజు పెంకుల మేడ** అని హెచ్చరిస్తారు. 'ఈ రాత్రి' కవితలో **యుద్ధం మీద యుద్ధం వచ్చినా మనిషి గుండె పగలలేదు; మనిషి మీద మనిషి చచ్చినా కన్ను తుదల జాలిలేదు. పాముకోర దేగరెక్క ఈ కాలానికి చిహ్నం; పూలతేనె, నెమలి రెక్క ఒక మిథ్యా ప్రమాణం** అంటూ మాధుర్య, సౌకుమార్యాలు మిథ్యా ప్రమాణాలై పాము కోరలు, డేగరెక్కలు మానవ జాతి అస్తిత్వ చిహ్నాలంటూ మనిషిలో పెరుగుతున్న అమానవీయ శాతాన్ని అక్షరబద్ధం చేస్తారు. మరోచోట మానవులు 'అలవాటుని, అస్వతంత్రతని కావలించుకుని; అధైర్యంలో తమలో తాము ముడుచుకుపోయి పడుకుని; అనంత చైతన్యోత్సవాహ్వానాన్ని వినిపించుకోలేక పోయారంటారు.

**ఇక కవులకు తరతరాలకు సరిపడ నిర్దేశాలనందించారు తిలక్.** "కవి వాక్కు" కవితలో మాటల మేజిక్కు నమ్మి, పాటల మ్యూజిక్కు నీలో క్రమ్మి మరిచిపోకు అసలువాణ్ణి, నీ సోదరుడైన మానవుణ్ణి అంటూ సాధారణ మానవుణ్ణి మరిచిన తక్షణం కవిగా అస్తిత్వాన్ని కోల్పోయినట్లే అనే సార్వజనీనమైన సూచన చేస్తారు. **ఒక సత్యంతో మరో సత్యాన్ని ఖూనీ చెయ్యకు; పరదేశ స్తుతిలో స్వకీయ సంస్కృతిని విస్మరించకు; ఇంకా కరిగి నీరై పోలేదు హిమలయ శిఖరాలు; ఇంకా మర్చిపోలేదు తథాగతుని, మహాత్ముని ప్రవచనాలు** అని కవిత చివరలో **కరుణ లేని కవివాక్కు సంకుచిత మౌతుంది** అనే ఒక అద్భుత సిద్ధాంత ప్రతిపాదన చేస్తారు. ఆ ప్రతిపాదనకు తానూ బద్ధుడై **మోడరన్‌గా ఉందామని, ఏదో అందామని తనకే తెలియని అస్పష్టపు అనుభూతిని అర్థం లేని ఇమేజరీతో కలగాపులగపు వర్ణనలతో** తాను బాధపడలేదు, మనలను బాధపెట్టనూ లేదు. కవిత్వం ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో 'నవత – కవిత'లో మరింత స్పష్టం చేస్తారు తిలక్. ఇందులో ప్రతీ వాక్యం ప్రస్తావించదగినదే.

"దుఃఖానికి, బాధకి కరుగలేకపోతే ఈ బాలగంగాధరుడు తన కవిత్వాన్ని, తన ప్రాణాన్ని కూడా బంగాళాఖాతంలో విసిరిపోతాడు'' అని మాగంటి మాణిక్యాంబాదేవికి వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. అందుకే వారి కవిత్వంలో ఈ రెండూ ప్రధాన దినుసులై, అనుభూతి మాటున అందంగా ఒదిగాయి.

**మానవత :**

**మేం మహస్సులం; మాకు దాస్యం లేదు; మాకు శాస్త్రం లేదు; మాకు లోకం ఒక గీటురాయి; మాకు కరుణ చిగురు తురాయి; మేం పరపీడన సహించం; మేం దివ్యత్వం నటించం** (మేగ్నా కార్టా) – అంటూ అచ్చమైన మానవుణ్ణి, మహస్సు కాగల మనుష్యుడి లక్షణాలను కవిత్వ మాధ్యమం ద్వారా అందజేసిన వాడు తిలక్. అందుకే ఎన్నెన్నో దృశ్యాలను చూసిన కవి వాటిని అక్షరబద్ధం చేసి మనకీ చూపుతారు.

**ఆకలితో అల్లాడి మర్రిచెట్టు కింద మరణించిన ముసలివాణ్ణి, నీరంధ్ర వర్షాన వంతెన కింద నిండు చూలాలు ప్రసవించి మూర్ఛిల్లిన దృశ్యాన్ని; మూర్తీభవించిన దైన్యాన్ని, హైన్యాన్ని, క్షుభితాశ్రు కల్లోల నీరధుల్ని, గచ్ఛత్ శవాకార వికారాల్ని.....** వీటన్నిటినీ చూడలేక, పడలేక, కృత్రిమ వేషాన్ని అభినయింపలేక, మానవత లేని లోకాన్ని స్తుతింపలేక, శిరసెత్తుకు తిరగలేక, ఈ నాగరికతారణ్యావాసం భరింపలేనంటాడు కవి.

ఒక్క నిరుపేద ఉన్నంతవరకూ, ఒక్క మలినాశ్రుబిందు వొరిగినంత వరకు... **ఒక్క శుష్క స్తన్య సన్నిధిని క్షుధార్తి నేడ్చు పసిపాప ఉన్నంతవరకూ... నాకు శాంతి కలగదింక నేస్తం...** వంటి వాక్యాలలో వివేకుని మహితోక్తులు స్ఫురిస్తాయి.

మానవ పరిణామ క్రమాన్ని, వికాసాన్ని; సమకాలీన సమాజాన్ని, సమస్యలను అర్థం చేసుకోడానికి నిజానికి తిలక్ ఉన్నత విద్యావంతుడు కాదు. కానీ, 'చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ' అని ప్రహ్లాదుడన్నట్లు తిలక్ చదివింది ఒక్క మానవుణ్ణి, అతని ఆర్తిని, ఆవేదనను, అనుభూతిని ... చాలవా! ఇవి? తిలక్ స్మారకసంచిక 'నవత'లో "మీరెరిగిన మా అన్నయ్య" వ్యాసంలో పార్థసారధిగారు మా వాడికి చదువు అబ్బలేదు, సాహిత్యం మాత్రం అబ్బింది అనుకున్నాం గానీ చదువంటే నాలుగు గోడల మధ్య చదివి పరీక్షల్లో పేసయి, పట్టాలు పొందడం కాదన్న విషయాన్ని వాడిని చూస్తేనే తొలిసారి మాకు అర్థమయ్యింది అంటారు గర్వంగా. శ్రీ శ్రీ ప్రశంసించినట్లు తిలక్ నూరుపాళ్ళు "సమకాలిక సమస్యలకు స్వచ్ఛ స్ఫాటిక ఫలకం" వాక్యం ఈ సందర్భంగా గుర్తు చేసుకోవాలి.

**నవత :** మృదుమాధ్వీ పదలహరీ తరంగ మృదంగ విలసద్భంగీ మనోహరాలౌ కావ్యాల్, గేయాల్ మాత్రమే కాక ఇతర కవులు స్పృశించని కవితావస్తువులనూ ఎంచుకున్నారు తిలక్. 'గొంగళిపురుగు'లో – **బస్ స్టాప్ దగ్గర పరాయి ఆడది తనకేసి చూసిందని, మెరీనా కాంటీన్ ఇవతల నుంచుంటే మినపట్టు వాసన ఘాటుగా వేసిందని, అసలు అప్పుడే కాంగ్రెస్‌లో చేరిఉంటే ఈ పాటికి మినిస్టర్ని అయిపోయి ఉండేవాడినని పెళ్ళాం దగ్గర చెప్పాలని సర్దాపడి "హయ్యోరామా నీ బతుక్కి" అన్నట్లు మూతివిరిచే అర్థాంగి ఆకారం తల్చుకుని ముడుచుకుపోయిన గొంగళి పురుగు తన్ని తానే తీసుకుని గోడ అవతలికి గిరవాటేసుకుంది....** అంటూ అన్నిటితో రాజీపడి ముడుచుకు బ్రతకాల్సిన గుమస్తా జీవితాన్ని కవిత్వంగా అనువదిస్తారు.

భూకంపం వచ్చిందన్నా, మరో యుద్ధం రేగిందన్నా, తన భార్య కవలల్ని కన్నదన్నా, కంగారుపడక కోటు తొడుక్కుని కోటీశ్వరరావు ఆఫీసుకెళతాడు, వస్తాడు అని జాలి చూపుతాడు. ఈ కవితలో పాత్ర పేరు కోటీశ్వరరావు కావడం గమనార్హం. **చనిపోయే ముందు రోజు మిత్రుణ్ణి కలుసుకుని "సుఖమంటే ఏమిటి? ఎలా**



**ఉంటుంది? ఎక్కడ దొరుకుతుంది అని అడిగాట్ట. ఈ సందేహం అతని జీవితానికే మచ్చ. ఇంకా పెరిగి పెద్దదవకుండా అతను మరణించడం దేశానికి రక్ష** – 'సి.ఐ.డి. రిపోర్ట్'లో ఈ వాక్యాలు తరతరాలుగా ఆ కుటుంబం సుఖమనే పదానికి నిర్వచనం తెలియకుండా బతికేసిందని (?) తెలియజేస్తూనే డాక్టరు తీర్పుకన్నా మేనేజర్ రాగానే నిలబడకపోవడమే అతను మరణించాడనడానికి రుజువు అనడం అతని ప్రభు భక్తికి, తిలక్ సృజనశక్తికి పతాకగా నిలుస్తాయి.

ఇక తెలుగు సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచిన 'తపాలా బంట్రోతు'ను **నీ మేజిక్ సంచిలో ఏ క్షణంలో ఏది పైకి తీస్తావో** ఆ క్షణాన నువ్వు రాజుతో సమానం అని అక్షరాలనిచ్చెనపై అందలమెక్కించి విడిచిపెట్టకుండా **నీ గుండె బరువు దింపుకోవడానికి ఒక గడప లేదు. ఒక్క నయనం నీ కోటు దాటి లోపలకు చూడదు. ఉత్తరం యిచ్చి నిర్లప్తుడిలాగ వెళ్ళిపోయే నిన్ను చూసినప్పుడు తీరం వదిలి సముద్రంలోకి పోతున్న ఏకాకి నౌక చప్పుడు** అంటూ వారి భావనాశక్తితో అతని కోటు దాటి లోపలి గుండె చప్పుడునూ మనకు వినిపిస్తారు.

ప్రారంభ అభ్యుదయ కవుల కాలం నుంచీ పీడిత వర్గాలకి చెందిన వ్యక్తిని వస్తువుగా తీసికోవడం జరిగినా ఈ చిత్రణకి ఒక సమగ్రత కలిగించి ఈ కాలానికి చాలా దగ్గరగా రాయబడిన కవితగా దీనిని డా. అద్దేపల్లి పేర్కొంటారు. రూపవర్ణన, ప్రగతి శీలత, ఆర్ద్రత ఈ కవితలో అద్భుతంగా పలికాయి. అందుకే ఈనాడు విశ్వరూపం ధరిస్తున్న పీడిత వ్యక్తి జీవన అభివ్యక్తి మార్గానికి బహుశః ఇదే మొదటి కవిత కావచ్చునని వీరి విశ్వాసం. కుందుర్తి ముందుమాటల్లో, డా. రెంటాల, శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మల వ్యాసాలలో ఉద్ఘాటించినట్లు కృష్ణశాస్త్రి భావ చైతన్యం, శ్రీ శ్రీ అభ్యుదయ కవితా చైతన్యాలనే రెండు స్రవంతుల ప్రేరణ మధ్య జనించిన కొంగొత్త గొంతుని ప్రతిభావంతంగా పలికించి వచన కవిత్వాన్ని మరింత పరిపుష్టం చేసి; జీవన లాలస, వస్తు వైవిధ్యం, గాఢతలతో వచన కవిత్వానికి రూపపరంగా "తీర్చిదిద్దిన" పుష్టినిచ్చి, పాఠక హృదయ సీమలలో అమృతం కురిపించిన సాహితీ మేఘం తిలక్.

*** ఏప్రిల్ 4, 2015న "శ్రీవాణీ రసరాగసభ" నిర్వహించిన సాహిత్య సభలో ప్రసంగం.**

# 18 ఓ విరుపు, ఓ మలుపు, కొసమెరుపు 'శిరీష' రెక్కలు.

సాహిత్యంలో ఓ కొత్త ప్రక్రియ ప్రారంభమైన తొలినాళ్ళలోనే దాని లక్షణాలను అందిపుచ్చుకుని ఆ సాహితీ సమూహంలో త్వరితంగా అంతర్భాగం కాగల అరుదైన కవులలో శిరీష (శ్రీ వేదుల శ్రీరామ శర్మ) ఒకరు. ఇప్పటికే ప్రచలితమైన అన్ని ప్రక్రియల్లో తనదైన ముద్ర వేసిన వీరి భావ విహంగపు రెక్కల సంపుటి **"సిరిగమలు – గలగలలు"**

కవితా శిల్పం, కవిత్వ ప్రయోజనం పట్ల నిర్దిష్టమైన అభిప్రాయం గల కవి శిరీష. అందుకే,

**'తొలివిరుపు**
**మధ్య మలుపు**
**కొసమెరుపు**
**వస్తు శిల్పమై**

**సమాజానుభవ అక్షరాలు**
**స్పందన కథా హృదయ భావాలై'** అని భావించి, తన సమాజానుభవాలు అన్నిటికి ఈ విరుపు, మలుపు, కొసమెరుపులను అందంగా జోడిస్తే అది ఈ రెక్కల పుస్తకమయింది.

నిజానికి కవి ఉద్దేశ్యంలో, కవిత్వ సృజన అంటే అనుభూతుల్ని ముద్దాడుతూ, అనుభవాలను వేటినీ విడిచిపెట్టక వాటికి అక్షర రూపమియ్యడమే. అందుకే

**'కిస్ చేయిస్తూ**
**అనుభూతుల్ని**
**మిస్ కానీయక**
**అనుభవాల్ని**

**కిస్ మిస్ లా**
**కవిత్వం జీవన ధార'** అంటారో రెక్కలో.



అనుభవాలంటే కేవలం సంఘటనలే కాదు. స్ఫూర్తిప్రదాతలైన మహోన్నత వ్యక్తులునూ. అందుకే, సాహితీ జగత్తులో ఎందరో ప్రముఖులను తన అక్షర శాలువాతో సమ్మానిస్తారు శిరీష. వాటిలో **"మానవీయ రహదారి / భారద్వాజ రావూరి; అక్షర అనుభూతి మెయిల్ / విస్మయ భావ ఇస్మాయిల్; విమర్శకు సౌరభ మద్దే మల్లి / ప్రజా అంతరంగం అద్దేపల్లి"** వంటి వాక్యాలు కవికి వారిపట్ల భక్తిని, పద విన్యాసశక్తిని మనకు తెలియజేస్తాయి.

నచ్చిన పదం ఏ భాషదైనా సందర్భానుకూలంగా ఔచిత్య భంగం లేకుండా వా(ఆ)డుకోవడం వీరి బలం. నిజానికి, అత్యంత సాధారణ భావాలు కొన్ని, పదాల మాయాజాలంతో కొత్తగా అనిపిస్తాయి. అవును కవిత్వమంటే 'తైరేవ విన్యాస విశేష భవ్యైః సమ్మోహయన్తః కవయః జగన్తి' కదా! అందుకు ఉదాహరణ :

**'కరుగుతూ**
**వెలుగులిస్తూ**
**నలుగుతూ**
**పరిమళిస్తూ**

**వత్తిగా దీపరాగమై**
**వత్తిడిలో పూల సౌరభమై'.**

పువ్వును, దివ్వెను త్యాగచిహ్నాలుగా పరిచయమున్న పాఠకుడికి వత్తి, వత్తిడిల ప్రయోగం వినూత్నంగా తోచి ఆకర్షిస్తుంది. ఇవే ఉదాహరణలను మరో రెక్కలో మరో సందేశాన్నందించడానికి ఉపయోగిస్తారు – ఇది బహుముఖీనతకు నిదర్శనం.

**'ఓ పువ్వై**
**పరిమళించక**
**ఓ దివ్వై**
**చీకట్లు తొలగించక**

**ఎందుక్కాని మనిషై**
**ఎన్నాళ్ళుంటేనేం?'**

మరో అందమైన పదవిన్యాసం ఈ రెక్కలో కనిపిస్తుంది చూడండి;

**'ఆహారం మోస్తూ**
**అకాలంకై దాస్తూ**
**కష్టంలో సమిష్టిగా**
**చీమల బారు**

**తప్పుగా సంపద దోస్తూ**
**తరాల కోసం మనిషి దాస్తూ'.**

మరోచోట **"భర్త వినీ / వినపడనట్లుంటే / భార్య చూసీ చూడనట్టుంటే / సాధన ఆదరింపు జంట / సాధింపుల్లేని సంసార పంట"** అని చమత్కారంగా చెప్పిన శిరీష; మరో రెక్కలో **"రాగితో పుత్తడి రాణింపు / ప్రేమతో భక్తి పరిమళింపు"** అనడం ప్రశంసనీయమైన ప్రయోగం.

ఇక, **"నరాల బంధం / సిరలూ ధమనులూ / నరుల బంధం / సిరులూ ధనాలు"** అన్నపుడు కవిగా; **"తులాభారంలో / తులసి దళం / రామాయణంలో / వానర దళం / పవిత్ర మనో భక్తి / అఖండ మహీ శక్తి"** అన్నపుడు వ్యక్తిగా – వాక్య రూపంలో కవి అభివ్యక్తీకరింపబడతారు.

చివరగా, ఓ రెక్కలో **"పూల రంగులు / దేనికదే ప్రత్యేకం. తోట సౌరభాలు / వేటికవే వైశిష్ట్యం"** అని పేర్కొన్నట్లు, ఈ రెక్కల వైవిధ్యపు సౌందర్యంతో మనల్ని పులకింపచేసిన శిరీష, వారి సాహితీ గమనంలో మరిన్ని గమకాలను పలికించాలని, గలగలలు వినిపించాలని ఆశిద్దాం.

***

అన్నా... అనుకున్నా...




**Avadhanula Mani Babu**
M.Sc., B.Ed.,
99481 79437
avadhanulamb@rediffmail.com


"సాహితీ స్రవంతి - ప్రతి నెలా సాహిత్యహేల", కాకినాడ
రెండేళ్ళుగా కల్పిస్తున్న సాహిత్య వాతావరణం
రూపుదిద్దిన ఒక మణి 'మణిబాబు'.
మంచి కవిగా, ఉత్తమ విశ్లేషకునిగా, వ్యాసకర్తగా
సహృదయుల మన్ననలు పొందుతూ,
పరిణతి మార్గంలో నిరంతర ప్రయాణం చేస్తున్న ఇతడు
భవిష్యత్ కాలంలో సాహితీ రంగంలో తనదైన
విశిష్ట స్థానం పొందగలడు.
అతని ప్రతిభ, కృషి ఈ విశ్వాసాన్ని తప్పక కలిగిస్తై.
మణిబాబుకి నా అభినందనలు, శుభాకాంక్షలు...

డా॥ అద్దేపల్లి రామమోహనరావు
సుప్రసిద్ధ కవి, విమర్శకులు